

గ్రంథకర్త:

# ఆమిదాల రామస్వామి కవి

మల్లాపురము.

ఓం

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# చిరుతల - శ్రీకృష్ణలీలలు

కం॥ శ్రీ రుక్మిణీ మనోహర
సారసదళనేత్ర సకల । సన్మునిమిత్రా
ద్వారక నిలయ జనార్దన
సారెకు నను బ్రోవు నిన్ను । సన్నుతి జేతున్॥

## గణపతి ప్రార్థన.

దరు॥ మంగళమూర్తి । మా । తంగవదన విఘ్నరాజ ॥మం॥ అంగజ శతకోటిరూప । యఘవినాశ బహుప్రతాప । రంగుమీరగా నిటకును । రాగదయ్య ఏకదంత ॥మం॥ సరసిజనేత్రా । సుర । సంఘ వినుతసుచరిత్రా ॥స॥ హరగిరిజావర తనయా । వరదాయక నినుస్మరింతు । ధరగుమ్మడి దాలపోరి వరభక్తుల నేలుమయ్య ॥మం॥

## సరస్వతీ ప్రార్థన.

దరు॥ తల్లీ శ్రీశారదాంబ । దయగను సద్గుణకదంబ । పుల్లాబ్జ క్షీరొనిను నా।యుల్లమందు నమ్మియుంటి ॥త॥ పరమేష్ఠిప్రియరాణీ । పద్మముఖి గీర్వాణీ । కరణాసాగరినిన్నూ । ఘనముగ నుతియింతుమదిని ॥త॥ ధరగుమ్మడిదాలపోరి । హరికోడలవమ్మకోరి । కీరవాణి కంది బాలకిష్టయ నేలును భూరి ॥త॥

సం-వ॥ ఇట్లిష్టదేవతాభి వందనం బాచరించి నాయొనర్పం బూనిన కృష్ణలీలలకు కథావిధానం బెట్టిదనిన.

## సూత్రధారి ప్రవేశము.

దరు॥ కమలాయతాక్ష శౌరి।కరివరదా గిరిధారీ । సుమనసవందిత చరణా । సుజనావన చక్రధారి ॥క॥ దేవకి వసుదేవతనయ । పావనాంగ యదురాయా । భావజ జనకాప్రమేయ । భవవినాశ సుగుణరాయ ॥క॥ ధరగుమ్మడిదాల నగర । ధామా శ్రీగరుడగమన । సిరులొసంగి కంది బాల । కిష్టయనేలు దయాఘున ॥క॥

సం—వ॥ ఇటు లరుదెంచి సూత్రధారుండు నటిని బిలచుట.

వాదం - దరువు.

సూ॥ ఆలస్యము జేయకనిట । కరుదెంచవె సఖీనటీ । చాలూనీ శృంగారము । నీలాలకి సుగుణపేటీ ॥ఆ॥

వ॥ నటీ నీశృంగారం బింతటితో చాలించి ఒకసారి యిటురమ్మా.

నటి ప్రవేశించి.

న॥ నాథా మీకిదె మ్రొక్కెద । ననుబిలచిన పనియదేమి । సాదరముగ విన్నవింప । పలిపెటిదానను స్వామీ ॥నా॥

వ॥ ప్రాణేశ్వరా నన్నిట్లు తొందరగా బిలపించిన కారణమెట్టిదో విన్నవించుడు.

సూ॥ వనజాయతలోచని భగ । వంతుని కథలను వినగను । ఘనులగు యీసభాసదులు । జనుదెంచిరి యీవేళను ॥న॥

వ॥ సఖీ యీసభాసదులేదైన మనోరంజకమగు నాటకంబును దర్శింప కుతూహల చిత్తులై విచ్చేసి యున్నవారలు ఏనాటకము ప్రదర్శించిన బాగుండునాయని నిన్ను విచారింపనెంచి బిలచియుంటిని.

న॥ సర్వసమర్థులు కళావి । శారదులును మీరెరుగని । యుర్వి లోన గలదెద్దియు । యూహించుడి చిత్తమూని ॥స॥

వ॥ మీరెరుగని నాటకంబులుగలవా తామే విన్నవించుడు.

సూ॥ వినుమిక శ్రీకృష్ణలీల । లను ప్రదర్శించియూను । జనులందరికహ్లాదము । సలుపనెంచి యుంటినేను॥

వ॥ మనోహారీ మనమూ లీలామానుష విగ్రహుండగు శ్రీకృష్ణపరమాత్మని లీలలను ప్రదర్శింప నెంచియుంటిని యిందుకు నీయభిప్రాయమేమో విన్నవించుము.

న॥ అటులైనను సంతోషమె । యాలస్యము జేతురేల । పటుతర కూశ్మాండపారి । భగవంతుడు మెచ్చుమనల॥

వ॥ సరేకాని నాథా శ్రీకృష్ణలీలలను రచియించిన వారెవరు రచియింప జేసినవారెవరు వారినామంబులం దెలిపి నన్ను కృతార్థురాలిం జేయుడు.

సూ—వ॥ సరే అటులే విన్నవించెదను వినుము.

సీ॥ శ్రీకరంబౌ మెదక్ జిల్లాలో జేరిన । తాలూక నర్సపూర్ దానవెలయు । గుమ్మడిదాల గ్రామమ్మున వసియించు । పద్మశాలికు లుండు పరమయశుడు । కందివంశాబ్ధిరాకా శశాంకుండను । బాలకిష్టయ్యను బరగునతని । సతిసాధ్వి బాలమ్మ సుతులారుగ్వురునువారు । సరసులు సద్గుణశాలురెలమి । ప్రథమసూనుండను బాల్ శెట్టియనవొప్పు । పరమాత్మభక్తుండు భవ్యగుణుడు । పరగ రెండవవాడు పాపయ్యనాముండు । బాలరాజనుగని పరము జెందె । నారాయణ తృతీయ నందనుండనువాడు । ధీవిశాలుండు సద్ధీరవరుడు । వినుమి నాలవవాడు వీరయ్యనాముండు । భూరితక్షమాశాంతి భూషణుండు । రహించి నైదవవాడు రాజలింగంబును । సరళస్వభావుండు సజ్జనుండు । సరసుడారవవాడు సహదేవనాముండు । వీరలు సత్కీర్తిగోరిమిగుల॥ వసుధ మల్లాపురి గ్రామవాసుడైన । అమిదాల రామస్వామియనెడు కవిని । బిలచి బహుమతులిచ్చి సంప్రీతితోడ । యిట్టిగ్రంథంబు జెప్పించిరింతివినుము.

న-వ॥ ఓహో ఈ గ్రంథమును రచియించినవారు మల్లాపురి గ్రామవాసుండగు అమిదాల రామస్వామిగారును కృతిజేయించినవారు కంది బాల్ శెట్టిగారును వారితమ్ములా సరే యిప్పుడు గ్రాహ్యమైనది.

సూ-వ॥ శాంతామణీ కాలము మిక్కుటమించు చున్నది పాత్రలను సిద్ధపరచవలయును రమ్ము.

న-వ॥ నాథా అటులే పోవుదము పదుము (నిష్క్రమింతురు)

వసుదేవుడు ప్రవేశము - దర్వు.

ధీవిశాలుడను భుజబలుడను వసు । దేవుండను వాడనువినరా । కేవలకీర్తి విశాలుడరోహిణి । దేవి దేవకియు భార్యలురా ॥ధీ॥ అంగజకోటి నిభాంగుడసజ్జన । సంగతిగోరు మనుం డెదరా । సంగరరంగజయుండనురా రిపు । పుంగవులను దునుమాడితినా ॥ధీ॥ సకలశాస్త్ర పారంగతుడను ద్వా । రకనగరము పాలింతునురా । ప్రకటితముగ శ్రీగుమ్మడిదాల । పౌరి శ్రీహరికి భక్తుడరా ॥ధీ॥

వ॥ శ్రీమద్ద్వారకా నగరంబును పరిపాలించు వసుదేవ నాముండను అరివీర భయంకరుండను వింటివా ద్వారకా.

దేవకీదేవి ప్రవేశము.

దర్వు॥ దేవకి దేవిని నేనమ్మా । వసు । దేవుని ప్రియపత్నినె కొమ్మా । భావశుద్ధితో పతిపాదంబుల । సేవలుజేసెద శ్రీకరమంచును ॥ దే॥ జనకుడుగ్రసేనుడు వినుమా । నా । జనని సుశీలాదేవి సుమా । ఘనభుజ బలుడా కంసుడన్నయును । మనమునక్రోధము మాపై దలచెను ॥ దే॥ గుమ్మడిదాల పురీశుండా । యా । కమ్మవిల్తునిజనకుండా । మమ్ముల నెట్టులమరి రక్షించునో । యిమ్మహినే పాపమ్ముజేసితినో ॥ దే॥

దే-వ॥ చెలీ.

చె-వ॥ తల్లీ ఏమియాజ్ఞ.

వాదం - దర్వు.

దే॥ చెలియరో వినవే । నా । తొలిజన్మ ఫలమదేమొ తోచదాయె నామదికిని ॥ చె॥ ఖలుడగు యాకంసుడు చెల్లెలినగు నన్నిటుల దుఃఖ । ముల ముంపగజేసెను మమ్ముల నెవ్వరు రక్షింతురు ॥ చె॥

వ॥ చెలీ నాగర్భమందు పుట్టిన బిడ్డలను పుట్టినట్లు వరుసగా నేడు గురిని మాయన్నయగు కంసుండు వధించి నాకు తీరనిదుఃఖము గలిగించెను. మఱలనిప్పుడు గూడ గర్భవతినైయుంటిని ఏమిప్రయోజనము.

చె॥ మంచిదినము లూ । యే । తెంచక యుండునెయిటు చింతించిన ఫలమేమిగలదు ॥ మం॥ కొంచెపుగుణుడా కంసుని వంచించును భగవంతుడె । అంచయాన యిటువలెదుఃఖించక మొక్కెదనీకును ॥ మం॥

వ॥ అమ్మా నీయసురా కంసునికి ముట్టకపోదు మీకు మంచిదినములు రాకమానవు దుఃఖించకుము.

దే॥ ధరణివెలసినా । గుమ్మడిదాల నివాసుడైన । హరిని మనమునా । నిరతము సద్భక్తితోడ స్మరియించుచు దినములెట్లో । కరమొప్పగ గడిపెద నాకర్మమెట్టులో తెలియదు ॥ ధ॥

వ॥ చెలీ మాకన్నిటికిని ఆభగవంతుడేగలడు నాప్రాణేశ్వరుని సన్నిధికేగెదను. (అని దేవకీదేవి వసుదేవునికడకేతెంచి) ప్రాణేశ్వరా మీ పాదపద్మంబులకిదే వందనం బాచరించుదానను,

వ-వ॥ ప్రాణేశ్వరీ చల్లగావర్ధిల్లుము ఏమిసమాచారమో విన్నవించుము.

వాదం - దర్వు.

దే॥ నాథా యీకంసూని । బాధాలకును మనము । బాధాలకును మనము । యీధరలో జీవించు టెంతైన హీనాము ॥యెంతై॥

వ॥ ప్రాణేశ్వరా యీదుర్మార్గుడగు కంసునితో మనమింకెన్నాళ్లని యీబాధలనుభవింపవలయునో తోచకున్నది.

వ॥ సరసీజాక్షిరోయట్టి । దురితాత్ము డెవ్వరికి । దురితాత్ము డెవ్వరికి । వెరునజాలడు విరవీగూచుండునుమాటికి ॥స॥

వ॥ ప్రాణేశ్వరీ ఆకంసుండు పాపభీతిలేనివాడు పగతురకు భయ పడనివాడు ఇదియంతయు మన పురాకృతఫలంబన వలయును.

దే॥ వ్రేపల్లెకు నేగియుండె । వెలదీ రోహిణిదేవియు । వెలదీ రోహిణిదేవియు । యీపగిదీమన మేగియు।యచ్చోటనె నుండవలయు ॥వ్రే॥

వ॥ ప్రాణేశ్వరా మా అక్కయగు రోహిణీదేవి తనకన్నకుమారు డగు బలరాముని దీసికొని వ్రేపల్లెలో ఏచింతలేక కాలముగడపుచుండెను మనముగూడ అక్కడికేగిన బాగుండదా.

వసు॥ యెక్కడికేగినవాడు । అక్కడికేతెంచు నిజము । అక్కడి కేతెంచు నిజము।యిక్కడనేయుండిమనము యెట్లోకాలముగడిపెము ॥యె॥

వ॥ ఆకంసభూపాలుడు ఎరుగనిచోటున్నదా మన మెక్కడికేగినను కష్టాలుదప్పవు.

దే॥ కన్నబిడ్డ లేడుగురిని । కన్నట్టులజంపివైచె । కన్నట్టులజంపి వైచె । కన్నందుకు ఫలములేదు । కష్టాబ్ధిని మనలముంచె ॥క॥

వ॥ నాథా ఆచండాలుడు కన్నబిడ్డల నేడుగురిని వరుసగా జంపి వైచెను యీయష్టమ గర్భజనితుండైన దక్కెటి పుణ్యముకన్నదోలేదో కదా అయ్యో.

వసు॥ ధరగుమ్మడి చాలపోరి । హారియే దిక్కికమనకూ । హారియే దిక్కికమనకూ । తరుణిమణిసీవుయిట్లు । తగనిశోక మొందబోకూ ॥ధ॥

వ॥ ప్రాణేశ్వరీ మనకాభగవంతుడేదిక్కు అహర్నిశంబులు ఆప రాత్పరుని మనసారనమ్మి యుండుటే మనకర్తవ్యము అంతకుమించిన వని మనమేమియు జేయలేము రాత్రి చాలాగావచ్చెను నిద్రించుచము పొమ్ము,

కంసుడు ప్రవేశము.

దరువు॥ ఘనుడను మధురాపురి పరిపాలుడ । కంసభూవరుండను వినరా । ననుగనుగొని సురలైన వెరచెదరు । మనుజులెంతటివార లురా ॥ఘ॥ అరి భీకరుడను యుద్ధధీరుడను । గురుతర భుజవిక్రముడ నురా । ధరగుమ్మడిదాలవాసుడే యా । సరసిజాక్షునకు వెరువనురా॥ఘ॥

వ॥ మధురానగర పరిపాలకుండను మహాభుజబల శౌర్యుండను అరివీర భయంకరుండను కంసభూపాలుండను వినరా సారథీ.

సేన-వ॥ కంసభూపాలాగ్రణీ యాసింహాసనంబున గూర్చుండి సభ గావింపుడు.

కం-వ॥ అమాత్యవర్యా.

మం-వ॥ ప్రభో ఏమియాజ్ఞ.

కం-క॥ సురగరుడోరగకిన్నర । వరులును గ్రహతారకాది వర్గంబును భూ । వరులును నన్నేబొగడుచు । దిరుగాడుచు నున్నవారె తెలుపుముమంత్రీ॥

వ॥ మంత్రీ ముప్పదిమూడుకోట్ల దేవతలు నవగ్రహములు అష్ట దిక్పాలకులు గరుడగంధర్వాదులు ఇంకా యీసమస్త భూమీశ్వరులు నన్నేకొనియాడుచు నాప్రతాపంబునకు వెరచియున్నవారలేకదా.

మం॥ ప్రభో భూనభోంతరాళంబులు తమ ప్రతాపంబునకు వెరచి గడగడలాడుచున్నవి.

కం-వ॥ సరేకాని.

సీ॥ ఆకాశవాణి తానన్నట్లు దేవకీ తప్పక గర్భంబుదాల్చె నిట్టి । యష్టమ గర్భస్థుడైనట్టి పోరడే । నన్ను జంపునటంచువిన్న కతన । చెల్లెలంచనబోక చెరసాలవైచియు । ఘనులైనభటులను కావలుంచి । ప్రకటించుతోడ నబ్బాలునిగొని తెచ్చి । యిమ్మంటంటెనిగాని యింతవరకు॥ ఆసమాచారమేమి నాకందజేయ । కుండిరది యేమొకాని యూరుక్కుండ రాదు । తెలివితోడను కనిపెట్టవలెనటంచు । హెచ్చరించుము మంత్రి నీవెచ్చగాను॥

వ॥ దేవకీదేవి యష్టమగర్భమందుదయించు శిశువు నన్ను సంహరించునని మున్నాయాకాశవాణి దెలుపగవింటిని కావున ఇప్పుడామె

దాల్చియుండినది యష్టమగర్భమే కాబట్టి బాలుండుద్భవించినతోడనే సంహరింపవలయును కాబట్టి మనభటులెల్లరు వారుండుచెరసాలకు చుట్టు ముట్టు బహుజాగ్రతగా కావలుండునటుల నియమింపుము.

మం-వ॥ ప్రభో అటులేగావించెదను.

కంసుని భటులు ప్రవేశము.

తందాన పాట

కంసరాజు భటులము మేమూ । తందానతాన
హంసవాహనునకు వెరువమూ । తందానతాన
కామరూపములను దాల్చెదమూ । తందానతాన
భూమ్యాకాశముల దిరిగెమూ । తందానతాన
మునులయజ్ఞములను జెరతుమూ । తందానతాన
మురహరి భక్తులను గూల్తుమూ । తందానతాన
కులగిరులను నెట్టివెతుమూ । తందానతాన
జలనిధులింకంగ జేతుమూ । తందానతాన
తందానెతందానె తందానా । తందానతాన
బాలానగరాజవందానా । తందానతాన॥

భ-వ॥ ఒరే మన కంసరాజుగారు యాజ్ఞాపించినట్లు మనమంద రము రెప్పవేయకుండ యీచెరసాలను కాపెట్టుకొని యుండవలెను రండు.

దేవకీదేవి చెలికత్తెతో.

దే-వ॥ చెలీ.

చె-వ॥ తల్లీ ఏమిసమాచారము.

దేవ - దర్వు.

నొప్పులేమొ అధికమాయెనే । ఓచెలియనాకు । చెప్పతరముగాక నుండెనే । యెప్పుడెరుగ జాలనమ్మ యిట్టివేదనేమిసేతు । వొప్పదాయె నామనస్సు యుర్విలోన బ్రదుకలేను ॥నొ॥

వ॥ చెలీ యీగర్భవేదనకు తాళజాలకున్నదానను ఏమిసేయుదును.

చె-వ॥ అమ్మా యించుకసేపు ఓర్చుకొనుము నీకు చక్కని బాలుండుద్భవించగలడు.

దేవ - దరువు.

నడుములోన కలకుమూనెనే । ఓచెలియుయిట్టి । పుడమిదిరిగినట్లు దోచెనే । అడుగరమ్మ మంత్రిసానులైనవారి నిందుబిలచి । ముడుపు లన్నగట్టరె నా । యిడుములన్ని బోవునట్లు ॥న॥

వ॥ చెలీ మంత్రిసానులనైన బిలిపించి నాయీయాపద కడతేరు నట్లు జేయుము.

చె-వ॥ అమ్మా అటులేబిలిపించెదను కాని నీవు గట్టిగా అరవకుము. (అని యిటులను చున్నంతలో బాలుండుద్భవించును) ఆహా తల్లీ ఎంతచక్కని కుమారుని గంటివమ్మా॥

దే-వ॥ ఔనౌను నాయీకుమారుని సౌందర్యాదుల వర్ణింపనలవి గాదు. (వసుదేవుడు వచ్చినంజూచి) ప్రాణేశ్వరా మన కుమారరత్నముం జూచితివా.

వసు-వ॥ ఆహా ఏమిమనభాగ్యము శ్రీమన్నారాయణుండు మన జన్మములు పావనమొనరింపుటకుగాను మనకు కుమారుడై జన్మించెను చూడుము.

శా॥ కంటే చక్రముచూడు మల్లదిగో శంఖంబిద్దివే గాంచవే । మింటిక్రిబోలు శరీరకాంతిగను ధమ్మిల్లంబదో చూడవే । వింటిక్రిబోలెడు కన్నుబొమ్మలివిగో వీక్షించితేదెవి ము । క్కంటిన్మెచ్చెడుదేవు డితడవు నిక్కంబిద్ది ప్రాణేశ్వరీ॥

దే-వ॥ ఔను ప్రాణేశ్వరా మీరనుమాట యదార్థము ఈబా లునియందు పరమాత్మ లక్షణంబులు నిండియున్నవి మనభాగ్యమే భాగ్యము.

దేవకీ వసుదేవుల

దరువు॥ కమలనయన శ్రీనారాయణా । మము । గావు కృపతో నారాయణా । సుమనసవందిత నారాయణా । యో।సుజనరక్షకా నారా యణా ॥క॥ రాజవదనశ్రీ నారాయణా । గజ । రాజవరదశ్రీ నారా యణా । రాజమాళినుత నారాయణా । ఘన । రాక్షససంహార నారా యణా ॥క॥ అండజవాహన నారాయణా । కూ । ష్మాండపురీశ్వర నారా యణా।ఖండనభీమా నారాయణా । కంర । బాలకిష్టునుత నారాయణా ॥క॥

వ॥ హే ఆపత్కాలబాంధవా అనాధరక్షకా మాపాపంబుల క్షమించి మమ్మికడ తేర్చ భారమునీదే (అని యనుచున్నంతలో ఆబాలుడు శ్రీవిష్ణుభగవానుడుగామారి దేవకీవసుదేవులతో నేమనుచున్నాడన)

విష్ణుమూర్తి దర్వు.

వెరువకుడో పుణ్యులార । వెరువకుడో ధన్యులార । కరుణతోడ మిమ్ములాను కాపాడెదసుజనులార ॥వె॥ దుష్టులశిక్షించెదాను । శిష్టుల రక్షించెదాను । సృష్ట్యాదిదేవతల । కష్టంబులుదీర్చెదాను ॥వె॥ ధరణీ గుమ్మడిదాల ధాముండను శ్రీహరినీ । పరమాత్ముడనన్నుగనీ । పావనులై తిరిధరణీ ॥వె॥

వ॥ హే దేవకీ వసుదేవులారా కంసాదిదుర్మార్గులనువధించుటకై పుణ్యాత్ములగు మీగర్భమందుదయించితిని నన్ను వాత్సల్యతతో బెంచి మీజన్మములను పవిత్రముజేసి కొనుడు కాని మీరేమాత్రము దురపిల్లక నన్నీ చెరనుండి దప్పింపుడు ఎట్లన నన్నిప్పుడే వ్రేపల్లెకు గొనిపోయి నందుని భార్యయగు యశోద ప్రక్కనన్నిడి ఆమెకు జన్మించిన నాయోగమాయ యగు బాలికనుగొని తెచ్చి మీవద్దనుంచుకొనుడు. కంసుడొచ్చి యడగిన ఆబాలిక నందివ్వుడు. (అని బాలకుండగును)

దే-గీ॥ జీవితేశ్వర తడవేలజేతురింక । భటులునిద్రించి యుండిరిప్పట్లమీరు । మనదుసూనుని తట్టలోనునిచికొనియు । మెల్లగాదాటి పొండు వ్రేపల్లెకిపుడు॥

వ॥ ప్రాణేశ్వరా తడవేల జేయుచుంటిరి ఆభగవంతుని కృపవల్ల దుర్మార్గులగు కావలివారెల్లరు నిద్రించియుండిరి వారు మేల్కొనక పూర్వమే ఈబాలుని దీసికొని వ్రేపల్లెకేగి యశోదప్రక్కయందిడి ఆబాలిక నిక్కడికి గొనితెండు.

వసు-వ॥ సరే అటులే గావించెదను.

వసు - దర్వు - చెల్తి.

చిన్నిబాలునీ గంపలోనిడుకొని । శిరమునందునె నెత్తుకొనంగన । కారాగార ద్వారములన్నియు । కడుశీఘ్రంబె దెరచుకొనెనుగా । కావలివారలు కై పెక్కినటుల । పడియుండిరి యిప్పట్లనునేనిక । బాలునెత్తుకొని బైటబడితినీ । చాలాదూరము సాగివచ్చితిని । యమునానది తానేం

తయుదయుతో । యేడుపాయలుగ చీలిపోయెగా । యేయుపాయమూ లేకుండగనే । యే తెంచితి వ్రేపల్లెసమీపము॥ రామారామా రఘుకుల సోమా । ఆహారామా అయోధ్యరామా । తారకనామా దశరథరామ॥

వ॥ ఆహా యీ యర్ధరాత్రివేళ నొరులెరుంగకుండ బాలునెత్తు కొని యింతవరకెట్లో వచ్చియుంటిని గాని యశోదయొక్క అంతఃపురము నకు నెట్లుబోవుదును. నాకన్నిటికి ఆభగవంతుడేకలడు (అని వచ్చు చున్నంతలో)

యశోద ప్రవేశము.

దరువు॥ సౌందర్య గాత్రినమ్మ । సఖియాయశోదనమ్మ । నందూని రాణినమ్మ । నళినాయతాక్షినమ్మ ॥సౌం॥ వ్రేపల్లెకాపురమూ । గోపా లురముమేమూ । గోపమ్మాయనిజనులూ । కోరిబీలచెదరునన్ను ॥సౌం॥ ధరణీగుమ్మడిదాల । ధాముద్దై నెలకొన్నా । కరివరదునినమ్మి కాలంబు గడిపెదాము ॥సౌం॥

వ॥ చెలీ నామనవాలకింపుము.

చె-వ॥ అమ్మా అదేదో విన్నవింపుము.

య-వ॥ సఖీ నాకు గర్భిణినై నవమాసములునిండి యుండెనుకాని నేడదేమో నాకనేకముగా నొప్పులువచ్చుచుండె నేమిసేయుదును.

యశోద దరువు.

ఏమిసేతునే । నేనెటులసైతునే । స్వామితోడు సంకటంబు చాల గలిగెనే ॥ఏ॥ నొప్పులొచ్చెనే । నడుము । నొవ్వసాగెనే । యెప్పుడైన యిట్టిబాధ యెరుగజాలనే ॥ఏ॥ ముడుపుగట్టరే । నా । జడుపుదీర్చరే । పుడమిగుమ్మడిదాల రాముల పూజసేయరే ॥ఏ॥

వ॥ చెలీ నేనేమిసేయుదురు.

చె-వ॥ తల్లీ నీకు పుత్రుండు బుట్టబోవుచుండెను ఇంచుకసేపోర్చు కొనుము (అనునంతలో యశోద ప్రసూతియై కుమార్తెనుగని ఆబాలిక ప్రభావంబున ఎల్లరు మైమరచి నిద్రించుటయునంత)

వసుదేవుడు ప్రవేశించును.

దరువు॥ శ్రీరమణీమణిరమణా । శేషశాయి దివ్యచరణ । కారుణ్యా కరహృదయా । కాపాడరననునీదయ ॥శ్రీ॥ నిన్నునమ్మి యున్నవాడ ।

నితరులనేనై తెవేడ । సన్నుతామరేంద్ర పరమ । సాధువినుత సజ్జ
నహిత ॥శ్రీ॥ మందరాద్రిధీరాయర । విందనయనసుఖసదనా । కందిబాల
కిష్టుకు యూ । ఖండితసిరులిచ్చు దేవ ॥శ్రీ॥

వ॥ హాపరాత్పరా నేనెంతటిపాపాత్ముండను మాణిక్యమువంటి నిన్ను
యిక్కడవిడచి మసిబొగ్గువంటి ఆబాలికను గొనిపోవనుంటినిగదా అయ్యో
ఏమిసేయుదును సర్వమునకు నీదేభారము మమ్ములరక్షించ నీవేకర్తవు.
(అని యశోదాదేవి అంతఃపురంబుజొచ్చి బాలుని యీయశోదపక్కన
నిడి ఆబాలికనెత్తుకొనివచ్చి చెరసాలం బ్రవేశించి దేవకీదేవింజూచి)

వసు-వ॥ ప్రాణేశ్వరీ మనముద్దులకుమారుని ఆయశోద ప్రక్కలో
నిడి యీబాలిక నిందుదెచ్చితిని దీనిని నీకన్నబిడ్డవలె కాపాడుము (అని
యిచ్చిన దేవకీదేవి ఆబాలికనెత్తుకొను నంతలో రోదనంబుసేయును అది
విని కంసునిభటులు మెలకువజెంది తమలోతామేమనుకొను చున్నారన)

### భటుల దర్వు వాదం.

దు॥ లెండి రాలెండిరా। దేవకమ్మనీళ్లాడె ॥లెం॥ లందుముండకొడుకు
లోలె । పండుకొనియున్న రేల ॥లెం॥

వ॥ ఒరే గార్ధబాసురా ఒరే ధేనుకాసురా ఒరే దీర్ఘనాశికా దేవ
కమ్మ నీళ్లాడిందిరా లెండిలెండి.

గా॥ వార్లకురాదుర్ముఖా । మెర్లులేసినట్లునీవు ॥వా॥ తిర్లమర్ల
మాటలంటె । తిప్పితిప్పికొట్టెదాను ॥వా॥

వ॥ ఒరే దుర్ముఖా నీనోటికొచ్చినట్లు వార్లక ఆదేవకమ్మ యెప్పు
డు నీళ్లాడిందో తెల్పురా.

దు॥ యిప్పుడేరపిల్ల నీ । యేడుపుయినవచ్చెనాకు ॥యి॥ అప్పుడె
మేల్కొంటిమిమ్ము । లందరినిలేపుచుంటి ॥యి॥

వ॥ ఇప్పుడే ఆపసిపాపడు యేడ్చిండురా అది వినంగానే మిమ్ము
లందరిని లేపుచుంటిని.

ధే॥ పిల్లనోపిలగాడోకా । యెల్లిచూచివస్త నేను ॥పి॥ కల్లనిజము
దెలుసుకోని । కంసరాజుకెరిగింతము ॥పి॥

వ॥ ఒరే అట్లైతె నేను లోపలికెల్లి ఆపుట్టింది పిల్లనో పిల్లగాడో

చూచివస్త తాళుడు (అని లోపలికివెళ్లి దేవకీదేవి చంకలోనున్న బాలి కనుజూచివచ్చి) ఓరే యీతూరి ఆడపిల్ల బుట్టిందిరా.

దీ॥ ఓరి నీకండ్లుగాల । యేరీతిజూచినావో ॥ఓ॥ పోరడేర పోరి యెట్లు । బుట్టెను యీమాటకల్ల ॥ఓ॥

వ॥ ఓరే నీవు బాగజూడలేదు పుట్టింది పోరడేగాని పోరిగానేకాదు.

గా॥ యేదైతేమనకేమి । యెరుకజేతాం రాజుకిపుడు ॥యే॥ వాడు లాడపనిగాదు । వడివడిగారండిపోదాం ॥యే॥

వ॥ ఒరే యేపిల్లయితే మనకేం మనమిప్పుడేపోయి కంసరాజుకు దెల్పవలయును పదండి (అని కంసునివద్దికేగి)

భ-వ॥ హేకంసభూపాలా దేవకమ్మగారు నీళ్లాడినది. బాలుని ఏడుపు వినివచ్చి మీతో దెల్పుచుంటిమి.

కం-వ॥ ఏమీ నాశత్రుండుద్భవించెనా.

దరు॥ పుట్టెనుశత్రుడు నాకింకా । పట్టివధించెద విడువనికా । అట్టెనాకు యెవరడ్డమైనను । గట్టిగాను తలగొట్టివైచెదను ॥పు॥ చెల్లెలు నాతో బుట్టువనీ । యీపిల్లడు నామేనల్లుడనీ । యెల్లధర్మముల నెంచకుండ యీ । నల్లవానినే నలచివైచెదను ॥పు॥ గుమ్మడిదాలవాసుడటా । యీ । కుర్రనిరూపున బుట్టెనటా । హుమ్మనికరవాలమ్మునపుడా । తమ్మి కంటిని ధ్వంసముజేసెద ॥పు॥

సం-వ॥ అని కంసుండు దేవకీదేవి వద్దకేగి యేమనుచున్నాడన.

కంసుని దరువు.

దేవకి నీపుత్రుని । యిటు । దెమ్మి నాదుశత్రునీ । దేవదానవులు గనుగొన । తెగటార్చెద ఖడ్గంబున ॥దే॥

వ॥ దేవకీ నీకుద్భవించిన బాలునిటుదెమ్మి నాఖడ్గంబున ఖండించి భయంబుబాసెదను. ఊ ఆలస్యంబెందులకు.

దేవకి దరువు.

అన్నా మొగవాడుగాడు । యీడబిడ్డ నిదుగొచూడు । పున్నె ముంటుంది దీని । పొరిగొనకనుకాపాడు ॥అ॥

వ॥ అన్నయ్యా మొగచిన్నవాడు నీగండానబుట్టుననికదా ఆనాడు

ఆకాశవాణి బలికినది. అట్లు మొగచిన్నవాడు బుట్టక ఆడబిడ్డ బుట్టినది కావున యిది నిన్నేమిజేయగలదు రక్షింపుము.

కంసుని దర్వు.

ఆడదైతె నేమిక । నే । వీడబోను తెమ్మికా । యేదులోకముల వారలు । యేతెంచిన మన్నించను ॥ఆ॥

గీ॥ మేనకోడలైన మేనల్లుడైనను । గర్భమొక్కటైన గాదెకీడు । నమ్మదగదు పుట్టునక్షత్రమొకటైన । తప్పదండ్రి శాస్త్రధర్మవిధులు॥

వ॥ మేనల్లుడైనను మేనకోడలైనను దుష్టనక్షత్రమందు జన్మించిన దోషంబుదప్పదని శాస్త్రవేత్తలు జెప్పుచుండ నేను విందునెట్లు నాతో వృధావాదించక బాలికనిటుదెమ్ము (అని బాలికను బట్టబోవ వసుదేవుం డడ్డగించి)

వసు - దర్వు.

ఇంతకోపమేలనంటి । యిదుగోనీకు మ్రొక్కుచుంటి । పంతమేల నయ్య యిట్టి । బాలికను బ్రోవుమంటి ॥యిం॥

వ॥ బావగారూ మాపైనింత నిర్దయదలంచుట పాడిగాదు ఆకాశ వాణి వాక్యంబులను నిజమనినమ్మి ఈబాలికను సంహరించతగదు మన్నిం పుము నీకిదో నమస్కరించెదను.

కంసు - దర్వు.

చాలుచాలు చాలును । నే । సంహరింతుబాలనూ । యేలనునీ నీతులు నా । కేమాత్రము సరిపడవూ ॥చా॥

గీ॥ బావమరదివంచు పగవలదని యిట్టి । బాలవిడచియున్న బాధ వచ్చు । మిత్రుగాచితనదు శత్రులబరిమార్చ । రాచధర్మమండ్రి రాజవరులు॥

వ॥ కావున మిమ్ముల మన్నించి నాశత్రువగు యష్టమగర్భంబున బుట్టిన బాలికను సంహరింపకుంటినేని నాప్రాణహానికే కారకురాలగును. నాకడ్డమురాక దూరముగాదొలగుము. దేవకీ బాలికనిచ్చెదవా యేమం దువు.

దేవకి దర్వు

తోడబుట్టునగు నన్నిటు । దుఃఖాబ్ధినిముంచబోకు । కూడదిట్టి కార్యము సీ । కును మొక్కెద కోపపడకు ॥తో॥

కం॥ కట్టాకొడుకులనెల్లర । పట్టివధించితివి ఆడపడుచిది కోడల్ ।
నెట్టనచంపగవలెనే । కట్టడివిగదన్న అన్న కరుణింపగదే॥

వ॥ అన్నయ్యా నాముఖమైనజూచి ఈబాలికనైనను కాపాడుము నీదురాగ్రహము మానుము. అరి వీరభయంకరుండవగు ఈబాలిక నిన్నేమి జేయగలదు.

కంసుని దర్వు.

కరుణజూడజాలను । యీ । కందును విడజాలనూ । ధరగుమ్మడి దాలపోరి । హరియేయిటు లుద్భవించె ॥క॥

వ॥ నాకు భయపడి ఆవిష్ణువే యిట్లు స్త్రీరూపంబున మీగర్భమందుద్భవించెను. నేనేమాత్రము దయదలంచు వాడనుకాను. తెమ్ము ఆబాలికనిమ్ము (అని దేవకీదేవి చంకనుండి ఆబాలికను లాగుకొని ఆచంటిబిడ్డ రెండుపాదంబులంబట్టి గిరగిరత్రిప్పి నేలకుతికినతోడనే ఆబాలిక క్రిందబడక పైకెగసి భయంకరాకారంబుదాల్చి కంసునితో యీమను చున్నదన)

యోగమాయ దర్వు.

చాలురకంసాధమ చాల్ చాలుర నీసాహసంబు ॥చా॥ బాలనునే గాదు విష్ణుపనుపున వచ్చినమాయను ॥చా॥ కావరమున లోకబాధ గావించితివౌర చాల । నీవధగావించను శ్రీదేవుడిందు జన్మించెను ॥చా॥ ధారుణీ గుమ్మడిదాల దామోదరుడున్నడిలను । శూరుడవైతెను వాని । జేరి జరియింపను వెళ్లర ॥చా॥

ఉ॥ తెంపరివై పొరింపొరిని దేవకిబిడ్డల చిన్నికుర్రలన్ । జంపితివింకనైన నుపశాంతినిబొందక రాలమీద న । న్మొంపితి విస్సిరోవిధియునో జమె నాసరసన్ జనించినన్ । జంపెడివీరుడొక్కడెస సత్కృతినొందెడు వాడు దుర్మతీ॥

వ॥ ఒరే కంసాధమా నీవా యాకాశవాణి వాక్యములను నమ్మి పుణ్యాత్ములగు దేవకీ వసుదేవులను వృథా ఆయాసమొందించి వారి పుత్రులను జంపితివైన శాంతివహించక నన్ను నేలంబడవైచి నొప్పించి మహాపాపంబును గట్టుకొంటివి. కావున నిన్నుసంహారింప శ్రీమహావిష్ణువు నేను జన్మించినప్పుడే తానొకచోట జన్మించియున్నవాడు. నీవు శూరుడ

వైనచో వానిజయించి బ్రిదుకుము పొమ్ము నేను వైష్ణవమాయను (అని మాయమగును)

కం-వ॥ ఆహా ఆశ్చర్యము నన్నుజయించుటకా విష్ణువు జన్మించి యుండెనని మహాశక్తి వచించి మాయమయ్యెను. కాని నేను నిరర్థకంబుగా దేవకీ వసుదేవుల దుఃఖింపజేసితినిగదా వారిని శాంతచిత్తుల గావించి విడచిపెట్టుటే యుత్తమము (అని వెంటనే దేవకీ వసుదేవులకడకేగి ముకుళితహస్తుడై యేమనుచున్నాడన)

వాదం - దర్వు.

కం॥ దేవకి వసుదేవులార । దివ్యస్వభావులార ॥ది॥ పావనులగు మిమ్ములనే । బాధించితి పాపాత్ముడ ॥దే॥

వ॥ పుణ్యాత్ములారా నేనా ఆకాశవాణి వాక్యంబులనునమ్మి మిమ్ముల నెంతో బాధించితిని నాతప్పుక్షమింపుడు మీపాదములకిదే ప్రణామంబు లాచరించెదను.

వసు॥ వసుధాధిపకంసవీర । వరనీవిటుచింతిల్లకు ॥వ॥ బిసరుహాగర్భుడుమాదు । నొసటనువ్రాసినవ్రాలుకు ॥వ॥

వ॥ బావా కంసరాజా యిదియంతయు మాపురాకృత కర్మఫలము గాని వేరుగాదు. నీవేమాత్రము మాకొరకై చింతింపవలదు.

కం॥ చెల్లెలవని యెంచక నీ । శిశువుల నెల్లర జంపితి ॥శి॥ తల్లీనను క్షమియించియు । దయతోజూడగ గోరితి ॥చె॥

వ॥ అమ్మా దేవకీ నిన్ను తోడబుట్టువని యెంచక అపారమగు దుఃఖాబ్ధిలోముంచిన పాపాత్ముడను నన్ను క్షమింపుము.

దే॥ అన్నా చింతించకుమూ । అయినదేదో యయిపోయెను ॥అ॥ పన్నగనీమదిలో యా । భగవంతుని దల్పుమికను ॥అ॥

వ॥ అన్నయ్యా గతకార్యమునకు చింతించినలాభము లేదు ఇకనైనను సుస్వభావమున ఆభగవంతుని భజించి తరించుము.

కం॥ యిష్టమున్నచోటికి మీ । రేగవచ్చు చింతిలకను ॥యే॥ కష్టమనక సంతసమున । కాలంబును గడుపుడికను ॥యి॥

వ॥ మీరిక మీయిష్టానుసారముగా యిక్కడినుండి వెళ్లవచ్చును మీకేమి నిర్బంధము లేదు.

వసు॥ ధరగుమ్మడిదాల శౌరి । హరి మాపై కరుణించెను ॥హ॥ కరుణతోడ సెలవిస్తిరి । యరిగెము ద్వారకకింకను ॥ధ॥

వ॥ బావా మేమిక ద్వారకకేగి ఆభగవంతుని స్మరించుచు కాలంబు వెళ్లబుచ్చెదము సెలవిండు.

కం-వ॥ సరే పోయిరండు (అనిన దేవకీవసుదేవులు రథారూఢులై ద్వారకకేతెంచి సుఖంబుననుండిరంత అక్కడ వ్రేపల్లెలో యశోదాదేవి తనబాలునియొక్క చక్కదనముంజూచి సంతోషస్వాంతయై తనచెలికత్తెలతో నేమనుచున్నదన)

యశోద - దర్వు.

(సువర్ణ సుందరిలోని - బంగారువన్నెల రంగారుసంజా
రంగేళి రాడాయెనే - అనువలె)

అందాలరాశీ నానందనూనీయొక్క । సుందారమునుజూడవే । చెలియా । నందనందనుడానవే । చెలియా ॥నం॥౧॥ బాలచంద్రుడే మోము భాసూరతనుకాంతి । నీలామేఘచ్ఛాయనే । చెలియా । బాలాగోపాలూడౌనే । చెలియా ॥బాలా॥౨॥ పంకేరుహాక్షూడు పద్మనాభుడు వీడు । శంఖచక్రములుండెనే । చెలియా । శేషశయనుడానవే । చెలియా ॥శే॥౩॥ కలకలలాడేటి వెలలేనినవ్వులు । చిలుకాపలుకులజూడవే । గుమ్మడిదాల । శ్రీకాంతుడితడానవే । చెలియా ॥శ్రీ॥౪॥అందాల॥

వ॥ చెలీ చూచితివా నాకుమార రత్నంబును.

చె-వ॥ అమ్మా యశోదాదేవీ ఈబాలుడు మీపూర్వపుణ్యఫలంబున మీకు జన్మించియుండెను.

య-వ॥ సరేకాని యీవర్తమానంబు నాప్రాణేశ్వరుని కెరిగించి సత్వరంబున రమ్మా పొమ్మా.

చె-వ॥ అటులే ఎరిగించి వచ్చెదను.

నందరాజు ప్రవేశము.

దర్వు॥ నందరాజ నాముడాను । నయగుణ శీలుండనేను । సుందరాకారుడాను । సుజనజనవంద్యుడాను ॥నం॥ పటుతర వైభవుడను వ్రేపల్లెకు యధికారుడాను । కుటిలాలకి యాయశోద । కును ప్రాణవల్లభుడను ॥నం॥

ధరగుమ్మడిదాల పౌరి ధాముడైన శ్రీహరినీ । కరుణగోరి యెల్లప్పుడు ।
దిరుగుచుండువాడపూని ॥నం॥

దాసి-వ॥ ప్రభో నందరాజా నేనొకశుభవార్త గొని తెచ్చి యున్న
దానను.

నం-వ॥ సరే నీవుగొని తెచ్చిన ఆశుభసమాచార మేదో త్వరగా
వినంజేయుము.

దా-వ॥ యశోదా దేవికి చక్కని మొగశిశువు జన్మించెను అమ్మ
గారు మీతో దెల్పుమని నన్నుదోలించెను.

నం-వ॥ ఆహా నాభాగ్యమే భాగ్యము. నేడెంత సుదినము పరి
చారికా పోవుదముపద నాముద్దుల కుమారునిజూచెదను.

యశోదకు నందునికి - వాదం.

య॥ ప్రాణేశ్వర మనకుదయించిన యీ । బాలునియందముజూ
డండీ । నాకెంబొప్పగ వీనికిదగినా । నామముప్రేమతో నిడరంటీ॥

వ॥ ప్రాణేశ్వరా మనకుమారరత్నంబుం జూచితిరా వీడుదయిం
చుటచే మనవంశము పవిత్రమయ్యెను.

నం॥ కాంతామణి నేడెంతో సుదినము । సంతోషంబును జెందితిగా ।
వింతగాదు యీ బాలుండును శ్రీకాంతుండేయన జెల్లునుగా ॥కాం॥

వ॥ ప్రాణేశ్వరీ మనయీకుమారుడు సాక్షాత్ భగవదాంశసంభూ
తుడే యనవచ్చును సుమా.

య॥ జ్యోతిశ్శాస్త్రము నెరిగినపెద్దల । ప్రీతితోడ బిలిపించండీ ।
జాతకరణమును నామకరణమును జయప్రదముగ జేయించండీ॥

వ॥ ప్రాణేశ్వరా బ్రాహ్మణోత్తములను బిలపించి జాతకరణము
నామకరణము జేయించుడు.

నం॥ పడతీమణి నీవన్నట్టులనే । బ్రాహ్మణోత్తముల బిలపింతుగా ।
పుడమిలో వెలసిన గుమ్మడిదాల । పురుషోత్తమునీ మదినెంతుగా॥

వ॥ ప్రాణేశ్వరీ నీవన్నటులే బ్రాహ్మణోత్తములను బిలపించెదను.

గర్గుండను బ్రాహ్మణుడు రాకడ

దర్వు॥ గర్గుండను పౌరోహితుడనుస । న్మార్గవర్తనుండను వినరా ।
భర్గుని పాదాంబుజముల నెప్పుడు । ప్రస్తుతిసల్పెటివాడనురా ॥గ॥ వరగ

నాది వేపల్లెకాపురము। బ్రాహ్మణోత్తముండను వినరా । కరమొప్పగ షట్శాస్త్రంబులనే। కంఠగ్రస్తము జేసితిరా ॥గ॥ ప్రేమతో డయానందుడునన్ను బిలువనంపగను వస్తినిరా । యీమహి వెలసిన గుమ్మడిదాల యిందిరేశు కృపవడసితిరా ॥గ॥

నం-వ॥ ఇటులరుదెంచిన గర్గపౌరోహితునిజూచి నందుడీమను చున్నాడన.

నం-వ॥ గర్గమహాత్మా మీకిదో వందనంబులు. యీబాలకునకు జాతకర్మ నామకరణాదులం గావింపుము.

గ-వ॥ నందరాజా అటులే గావించెదను.

గీ॥ జాతకంబునుజూడగా మాతులకును । గండమొక్కటిదప్పయు కడమవన్ని । మంచిగానుండె నిట్టికుమారుపేరు । కృష్ణుడన నొప్పమిగుల సత్కీర్తినొందు॥

వ॥ నందయశోదలారా యీబాలకుని కృష్ణుండనుపేరుతో బిలువుడు మీకు శుభంబులొనగూడును.

నం-య-వ॥ మహాత్మా అటులే బిలచువారము యిదో ఈదక్షిణలు గైకొని వెడలిపొండు.

నం-వ॥ అని యొసంగిన దక్షిణలుగొని గర్గుండు వెడలిపోవుటయు నంత యశోద కృష్ణుని తొట్లెలోనుంచి లాలిపాట బాడుచెటులన.

లాలిపాట.

లాలీశ్రీకృష్ణయ్యా । నీలామేఘశరీరా । బాలాగోపరిపాలా । పవళించూమాయయ్యా ॥లా॥ బంగారూడోలికలో పద్మాక్షానిన్నునిచి।మంగళాంగుబాలుడా మరిదిదురాబోవయ్యా ॥లా॥ చుట్టాపక్కములెల్లా।చూడా వచ్చిరినిన్నూ । అట్టేయల్లరిజేయా । కనునిదురాబోవయ్యా ॥లా॥ ముత్యాలాహారములూ । మొలనూలూగజ్జలునూ । నీతండ్రిగొనివచ్చే । నిదురాబోమాయయ్యా ॥లా॥ మీయత్తాయగురాధా । కీమేల్మిబొమ్మలు దెచ్చే । శ్రీయుతాకారనిద్రా । మాయయ్యాబోవయ్యా ॥లా॥ వరతనయానీవుమా । వంశవర్థనుడవుగా । ధరణీగుమ్మడిదాలాధామా నిదురాబోవయ్యా ॥లా॥

యశ-వ॥ సఖీ జనులారా బాలుడు నిద్రబోవుచుండెను మనమావ లకు బోవుదమురండు.

కంసుని సభ.

కం-వ॥ మంత్రీ మన ధేనుకాసుర శకటాసుర బకాసురాదులను బిలపించుము.

మం-వ॥ అదో మీరనునంత మాత్రముననే వచ్చుచున్న వారలు.

అందరు-వ॥ జయము జయముమహారాజా జయము.

కం-వ॥ మిత్రులారా వింటిరిగదా నాకింకెక్కడి జయము.

బాలకోకిల వృత్తము.

మనము బెట్టెడుబాధలకు యామానివర్యులు దేవతల్ । జనియు శ్రీహరితోడదెల్పగ శౌరి యభయంబిచ్చియుఙ । [illegible] జన్మమెత్తె దనంచు తానన్నట్టులఙ । జననమొందెనటంచు [illegible] త్తిదెల్పగ వింటికఙ॥

వ॥ కావున మనమెంత జాగ్రతతో మెలంగినను శత్రుడు చేయి జారిపోయెను ఇకముందుకెట్లగునో యేమో తెలియదు.

వాదం - దర్వు.

శ॥ యిందరాము మేముండగ । నెందుకు మీకింతభయము । యెందునున్న యావిష్ణుని । వెదకిపట్టి ద్రుంచెదాము ॥యిం॥

వ॥ ప్రభో అరివీర భయంకరులమగు మేమిందరముండగా మీరెం దుకుచింతిల్లుచుంటిరి ఆవిష్ణు వెక్కడుండినను వెదకిపట్టి వధించెదము.

ధే॥ పలువేషములను ధరించి । యిలనెల్లను సంచరించి । జలజా క్షుని గుర్తించియు । చంపివైతు ధైర్యమెంచి ॥వ॥

వ॥ కంసరాజా పలువిధ మాయావేషములనుబన్ని ఆవిష్ణుని జంపి వైచెదను భయపడకుము.

[illegible] బ॥ హరిభక్తుల పీడించిన । యతడే తాబైలుపడును । వెరువనేల యజ్ఞయాగ । విధులను ధ్వంసముజేతును॥

వ॥ ప్రభో యెక్కడెక్కడ హరిభక్తులుండిరో వారిని వెదకిపట్టి పలువిధంబుల బాధించెదము అట్లుగావించుటచే ఆవిష్ణువు తనంతటతానే బైటపడగలడు.

కం॥ సరెసరె మీరన్నట్టుల । సత్వరంబె గావింపుడు । ధరణిగుమ్మడిదాల । హరిమిక్కిలి మాయకాడు ॥స॥

వ॥ మిత్రులారా నేజెప్పునది వినుండు.

సీ॥ భగవదారాధన బ్రాహ్మణారాధన । జేయువారలనెల్ల చెండవలయు । యజ్ఞయాగముల నెయ్యముగ జేసెటివారి।బట్టిబాధించి మాన్పంగవలయు । మునిగణంబులనొంచి కనికరంబిడనాడి । జీవముల్ బోవ శిక్షింపవలయు । సురగరుడురగకిన్నెర నాథులనుబట్టి । హీనకర్మముల దండింపవలయు॥ దేవతానాథుడైన లక్ష్మీవిభుండు । యేడనున్ననుపట్టి బాధింపవలయు । అష్టదిక్పాలురను చెరపట్టవలెను । మంత్రివరులార దుస్తరతంత్రులార॥

వ॥ కావున మీమీబలంబుల వెంటనిడుకొని నేజెప్పినటులం జేయుడు. విజయమును సాధించుకొనిరండు ఊరకమరలిరాకుడు.

అందరు-వ॥ ప్రభో అట్లు గావించెదము మాకనుజ్ఞ నొసంగుడు.

కం-వ॥ సరే పోయిరండు అట్లే పూతన నొకసారి సావద్దికివచ్చి పొమ్మని తెల్పుడు.

## పూతన ప్రవేశము.

దరు॥ పూతననమ్మా । నేను । భూతకినమ్మా । ప్ర । ఖ్యాతిగల్లదాననునే । కంసునియాజ్ఞలోనుండెద ॥పూ॥ మాయచేతనూ । సుర । మౌనివరులనూ । పాయకవంచించెదయే భయములేకనూ ॥పూ॥ కామరూపముల్ । నే । ఘనముగదాల్తుల్ । యీమహి గుమ్మడిదాన యీశుకువెరువల్ ॥పూ॥

వ॥ మాకంసరాజేంద్రుండు నేడు నన్నెందులకోగాని బిలువనంపెను. ఏదో గొప్పకార్యమేయుండి తీరవలెను.

గీ॥ హరిహరి బ్రహ్మలనుబట్టి యట్టెకట్టి । యీడ్చుకొని వచ్చుటకో లేక యింద్రునిటకు । బట్టితెచ్చుటకో యెట్టిపనియొకాని । దెల్పయుండెను సుదినమీదిన మెదినము॥

వ॥ సరే ఎంతటి ఘనకార్యమైన నేమిలక్ష్యము పోయివిచారించెదగాక. (అని కంసునివద్దకేగి) హేకంసభూపాలా మీకిదో వందనంబాచరించుదానను. నన్నెందులకై బిలపించితిరో యాజ్ఞాపించుడు.

సం-వ॥ ఆహా పూతనా నీకు సదాజయమగుగాక.

వాదం - దర్బు.

కం॥ పూతననొక పనిగల్గియు । ప్రీతితోడ బిలపించితి । ఖ్యాతిగల్ల దానవు నీ । ఘనత నేను గొనియాడితి ॥పూ॥

వ॥ పూతనా నీతోనొక ఘ[illegible]ము గావలసియుండుటచే నిన్నిం దు బిలపించితిని వింటివా.

పూ॥ యెట్టికార్యమో నాకు । యెరుక జేయు మహారాజా । పట్టి తెత్తు బ్రహ్మనైన । ప్రజ్ఞజూడు రవితేజా ॥ప్ర॥

వ॥ మహారాజా ఎంతటి ఘనకార్యమైనను క్షణములో గావించు దానను మీరేమాత్రము అనుమానింపక తెలియంజేయుడు.

కం॥ నన్ను జంపగావిష్ణుడు । పన్నుగాను జన్మించియు । నున్న వాడు వానిబట్టి । నుసురుదీయు నీ వెంతయు ॥ను॥

వ॥ పూతనా మున్నాయాకాశవాణి నాకు దెల్పినటుల నన్ను జయించుటకై ఆవిష్ణువు జన్మించియున్నవాడట నీమాయోపాయంబులచే వానిని వెదకిపట్టిచంపి నాప్రాణములను రక్షింపుము.

పూ॥ ఎంత కార్యమియ్యది ర । వ్వంతలో నెరవేర్చెదాను । చింత సేయవలదుయట్టి । శ్రీవిష్ణుని దుంచెదాను॥

వ॥ ప్రభో యింతమాత్రమునకే దావంత మొందుచుంటిరా ఆవిష్ణుడు బాలరూపంబున నెక్కడున్నను యిల్లిల్లు వెదకి నామాయోపాయంబున దుంచివైచెదను.

కం॥ నీకుతోడు శకటాసుర । ధేనుకాసురాదులునౌ । ప్రాకటముగ నేగియుండిరి । భయపడకుము మదిలోను ॥నీ॥

వ॥ నీకంటెమున్నే శకటాసుర ధేనుకాసురాదివీరులు ఆబాలుని వెదకుటకై నేగియుండిరి కాని నీవెట్లైనా కార్యమును సాధించుకొని రమ్ము పొమ్ము.

పూ॥ ధరగుమ్మడిదాల షౌరి । ధాముడైన శ్రీహరినీ । పరిపరివిధముల వెదకియు । పట్టివధించెద పూనీ॥

సం-వ॥ అని పూతన ప్రతిజ్ఞజేసి అచ్చటినుండి వెడలి మాయ బాలెంతవేశమున వచ్చుచున్నంతలో

గోపికలు ప్రవేశము (సవ్విపాటవలె)

దరు॥ పల్లెపల్లెదిరిగిమేము । పాలుపెరుగులమ్మునట్టి గొల్లవార మమ్మ యెట్టి । గొల్లవారమూ ॥గొల్ల॥ అందమైనచీరగట్టి అద్దాలరవికె దొడగి । పొందుగజతగూడి తిరుగుసుందరూలమూ ॥ప॥ సద్దులేమొదీసుకోని । చక్కగానుసుందకేగి ముద్దుగాను మొగలకిచ్చె । ముద్దుగాండ్రిమూ ॥ప॥ [illegible]మ్మడిదాలపొరి । కంది బాలకిష్టునేలు । వనజాక్షుని పాదసేవ [illegible]మూ ॥పల్లె॥

సం-వ॥ మాలతీమల్లికలను గోపికలు తమలోతాముసంభాషించుట.

మా-వ॥ మల్లికా నేడు మనయశోదకుమారుడు పుట్టిన దినమట మమ్ములను విందుభోజనమునకై బిలచియుండెను వింటివా.

మ-వ॥ ఔను మమ్ములనుగూడా బిలచియుండెను.

వాదం - దరు - మందారం.

మా॥ సుందరాంగులారా మన । మందారామూనుగలసి । నందానందనునిజూడ బోదమే । యూ । విందూభోజనముజేసీ వత్తమే ॥సుం॥

వ॥ సఖి మనమందరము చక్కగా శృంగారించుకొని నందరాజు గృహంబునకేగి బాలునిజూచి వచ్చెదమురండు.

మ॥ వట్టిచేతూలతోబోవలదూ మేలైన జరీ । పట్టూవస్త్రముల గొనీపోదమే । మన । చుట్టాలుబొగుడ మరలివత్తమే ॥వ॥

వ॥ మాలతీ మనము వట్టిచేతులతో బోయిన బాగుండదు నేను మాత్రమూ పిల్లవానికి కొన్ని పట్టుబట్టలను గొనివత్తును.

మా॥ తేనే మామిడిపండ్లు । తియ్యాని యరటిపండ్లు । నేనైతెగొని వచ్చుదాననే । పిల్ల । వానీచేతీకిచ్చివత్తునే ॥తే॥

వ॥ నేనుమాత్రము తియ్యని మామిడిపండ్లు అరటిపండ్లు గొని తెచ్చెదను నీవింకా ఏమేమి దెచ్చెదవో తెల్పుము.

మ॥ అత్తారుపన్నీరు । అగరుజవ్వాజీయు । చిత్తమలగంగగొని తెత్తునే । మా । యత్తాకొడుకూకు జూసివత్తునే ॥అ॥

వ॥ ఇంకా నేను అత్తరు పన్నీరు బుక్కాగులాలుదెచ్చి నాకు మరదివరుసైన కృష్ణునికి బూసివచ్చెదను.

మా॥ సరె సరేరమ్మా యీధరణీగుమ్మడిదాల । సిరివల్లభుడు మెచ్చబోదమే । యా । చిన్నికృష్ణుని జూచివత్తమే ॥స॥

సం-వ॥ అని యిటులా గోపికలు యశోదాదేవివద్దకువచ్చి ఏమను చున్నారన.

వాదం - దరువు (తేరెశివా)

గో॥ వందనమమ్మా యశోదవందనమమ్మా । నీ । నందనూని జూడవచ్చినార మోయమ్మా ॥వం॥

వ॥ అంహమ్మా యశోదాదేవీ ఇదో ఈకట్నములను గైకొనుము.

య॥ సంతోషముదోచెను నా । స్వాంతములోనా । నే । డెంతోను దినమంచును నేనెంచెడిదానా ॥సం॥

వ॥ అహా మీరెల్లరు విచ్చేయుటచే నాకెంతో ఆనందమనిపించెను రండు కూర్చుండుడు మాకృష్ణునిజూడుడు.

గో॥ అమ్మా నీపుణ్యంబేమనవచ్చునుగా । యిమ్మహి గుమ్మడి దాల యీశుడేలుగా ॥అ॥

వ॥ గోపమ్మా నీపుణ్యవశంబున యింతచక్కనికొడుకును గంటివి ధన్యురాలవు. (అని యిటులనుచున్నంతో పూతన బాలెంత వేశమున ప్రవేశము)

పూతన - దరువు.

భామరో నేను బాలెంతనమ్మా । యేమిసేతు నేనెటుబోదు నమ్మా ॥భా॥ కన్నసుతునివ్వకను మొగడుద్దిట్టి । నన్ను కోపించి వెన్నంటి కొట్టె ॥భా॥ కాని మొగనీతో కష్టాలుబడగా । లేను యేమందువానీనే బహుగా ॥భా॥ పాపిబ్రహ్మనాపై పగదలంచే । నోపలేనీకష్టాలుజ నించే ॥భా॥ పాలుసేవసల్పగ బూనెనమ్మా । పాలిచ్చెదనూ నీబాలూని దెమ్మా ॥భా॥ ధరగుమ్మడిదాల భామూనిసాక్షీ । సరకుజేయునామాట మీనాక్షీ ॥భా॥

వ॥ అమ్మా యశోదాదేవీ నను తొలుచూలి బాలెంతరాలిని నాపుత్రుని పక్కలోనిడుకొని నిద్రించియుండ ఆబాలకుడు రోదనంబు చేసిన నా మొగడు వినివచ్చి బాలునిదీసికొని నన్ను దిట్టి కొట్టి యిలువెడ లించెను. దుఃఖించుచు యిటువచ్చుచుండగా నాచంటిలో

వచ్చి సల్పుచున్నవి నీబాలునిటుదెమ్మని పాలిచ్చి నాశ్రమను దీర్చు కొనెదను.

వాదం - దర్వు.

య॥ ఏలనుపొమ్మా । చాల్ చాలును నీపాలును మా । బాలుడు గ్రోలగజాలడు ॥ఏ॥

వ॥ ఎవరమ్మా నీవు బలిమిన మాబాలుకి పాలిచ్చెదనని పలుకు చుంటివి మాకేమివలదు ఆవలకుబొమ్మా.

పూ॥ సేపులొచ్చేనూ । నేనోపజాల పాలను నీ । పాపనికిచ్చియు బోయెద ॥సే॥

వ॥ అమ్మా యశోదాదేవి నాకు పాలు సేపుచుండుటచే యిచ్చెద నంటిని యిందేమి దోషమున్నది నీముద్దులపాప నిటుదెమ్మా.

య॥ యితరులపాలూ । నాసుతుడెంతయు గ్రోలడు నీ । హిత వచనము లేలమాను ॥యి॥

వ॥ మాబాలుడు పరస్త్రీలవద్ద పాలుద్రాగువాడుకాడు వెడలి పొమ్మా మావాడిప్పుడే పాలుద్రావియుండెను.

పూ॥ యించుకపాలూ । గుడిపించియునేపోదు కోప । గించక నీబాలునిమ్మా ॥యిం॥

వ॥ ఏమమ్మా చంటిపిల్లవానికి పాలిచ్చెదనన్న వద్దనువారుందురా అదో ఆచిన్నికృష్ణుడు నావద్దికి వచ్చెదనుచుండెను చూడుము ఇటుదెమ్మా.

య॥ వలదనియన్నా । యిటుబలిమితొ పాలిత్తుననుచు పలుకు చుంటివేమొ తెలియు ॥వ॥

వ॥ వలదని యెంతజెప్పినను వినకుంటివి యిదో నీదెక్కువపాలం ద్రావడు కొంచెమిచ్చిపొమ్మా (అని కృష్ణునిచ్చిన పూతనగైకొని)

పూ॥ పుడమివెలసి నా । గుమ్మడిదాలపురీశ చన్ను । గుడచిదీర్ఘ నిద్రజెందు ॥పు॥

కం॥ నాచను బాలొక గ్రుక్కెడు
నోచిన్నికుమార ద్రావు । మెయిచుప్పునవిస్ఫురణ
నీచెలువ మెరుగవచ్చును
నాచెలువము సఫలమగును । నళినదళాక్షా.

సం-వ॥ అని పూతన పాలివ్వగా కృష్ణుడు ఆపాలతోగూడ దాని పంచప్రాణంబుల లాగుచుండగా జడసి.

పూతన - దర్వు.

విడువురా విడువురా । విడువర నాచన్నునీకు నడియేనర్పించె దాను ॥వి॥ బాలుడవనుకొనినీకు పాలివ్వగవచ్చియుంటి । చాలుచాలు తెలిసెను నీ । జోలికి నేరానింకను ॥వి॥ సుందరకూష్మాండపౌరి । సురవందితుడవుశౌరీ । కందిబాలకిష్టయ్యను । ఘనతనేలినట్టిహరివి ॥వి॥

వ॥ కృష్ణాకృష్ణా నాచన్నువిడువుము అబ్బో అబ్బో చస్తి చస్తి (అని రాక్షసరూపంబునబడి మరణించును)

యశో-వ॥ అమ్మయ్యో రాక్షసి రాక్షసి రండేరండే (అని బాలకృష్ణుని యెత్తుకొనును నందుడు మొదలగువారు వచ్చి రాక్షసినీడ్చుకొని పోవుదురు)

యశోద కృష్ణుని లాలించుట (కలవరమాయే)

దర్వు॥ ఎంతగమది జడసితివో । జడసితినో । వింతరక్కసిటు వేంచేసియు బా । లెంతననుచు గల్లంతలుజేసెను ॥ఎం॥ దండిగండమిది దాటిపోయె యూ । మొండిరక్కసికి మూడెనుచావిటు ॥ఎం॥ పాలుగుడువు గోపాలగుమ్మడీ । దాల హరియునిను దయతోబ్రోచును ॥ఎం॥

సం-వ॥ అని యిటులనుచున్నంతలో,

తృణావర్తుండు ప్రవేశము.

(తందానపాట)

తృణావర్తుడను వాడనురా । తందానెతాన
ఘనతరభుజ విక్రముడనురా । తందానెతాన
రాక్షసులకు మేటినివినరా । తందానెతాన
శిక్షజేతు సురమునులనురా । తందానెతాన
కంసునాజ్ఞలో నుండెదరా । తందానెతాన
హింసజేతు పగవారినిరా । తందానెతాన
ధరగుమ్మడిదాల హరికిరా । తందానెతాన
వెరువజాల నెంతయువినరా । తందానెతాన

తంద నెతందానె తందానా । తందానెతాన
బాలానగరాజ వందానా । తందానెతాన.

ప॥ ఇందరు మహాబలవంతులుండగా మాకంసరాజు నన్నేబిల పించి ఆవిష్ణుని జంపిరమ్మని యాజ్ఞనొసంగెను కాని నేను స్వర్గమర్త్య పాతాళంబులను వెదకివేసారి తుదకు ఈవ్రేపల్లెలో నందునింట జన్మించి యుండెననివిని యిక్కడికివస్తిని యికనే సుడిగాలినిగల్పించి ఆబాలునెత్తు కొని పోయెదగాక.

య-వ॥ మాలతీ యిదేమిగాడుపమ్మా.

మా-వ॥ పాడుసుడిగాలి ఘూ ఘూ (ఇంతలో తృణావర్తుడు పైనుండి కృష్ణునిజూచి)

తృ-గీ॥ విష్ణుపోల్కెల్ల విరవిగానీబాలు । నందుడోచుచుండె నయముగాను । వీనిగొంచునేను వినువీధికేగియు । ధరణిపైవనిపుడె మరణమొందు॥

సం-వ॥ అని యశోద చంకలోనున్న కృష్ణుని గైకొని పైకెగసి పోవును.

య-వ॥ అయ్యో అయ్యో నాబాలుడు నాకన్నతండ్రి నెవడో నాచంకనుండెత్తుకొనిపోయెను. (అని అనుచున్నంతలో తృణావర్తుడు చచ్చి క్రిందబడును వానిపై కృష్ణుడు గూర్చుండి గుద్దుచుండగా యశోద యెత్తుకొని) నాతండ్రి నాయయ్యా నీకిదియేమిగ్రహచారమురా మల్లికా మనమిక్కడ నుండవద్దు బాలునికి పాలిచ్చి పరుండబెట్టుదము రమ్ము. (అని కృష్ణునితొట్లెలోనునిచి) మల్లికా ఒకపాటబాడవే కృష్ణుడు నిద్రబోవును.

మ-వ॥ నాకు పాటలురావు నీవేపాడుము.

యశోద జోలపాటబాడుట.

జోజోమునిగణలోల । జోజోగోపాలా । జోజోనందునిబాల । జోజోకృష్ణయ్యా ॥జోజో॥ జోజోశ్రీయదునాథ జోజోశ్రీనాథా । జోజో ఇందిరనాథ జోజోకృష్ణయ్యా ॥జో॥ జోజోశశినిభపాల జోజోమునిలోలా । జోజోసద్గుణశీల జోజోకృష్ణయ్యా ॥జో॥ మందధీర గుమ్మడిదాలవాసా । కందిబాల్ కిష్టయను కరుణించుశ్రీశా ॥జోజో॥

సం-వ॥ అని యిటుల యశోదాదేవి కృష్ణునితొట్లెలోనునిచి జోల పాటపాడుచున్నంతలో కంసునిపంపున.

శకటాసురుడు ప్రవేశము.

దర్వు॥ మహిషాసురమర్దనీం । మహామాయిశాంభవీం । అహివేణీశార్వరీం । అఖిలలోకపాలనీం ॥మ॥ శూలఖడ్గపాణినీం । శుభ్రవస్త్రధారిణీం । కాలకంఠరాశి ఓం । కాత్యాయని హ్రీంక్లీం ॥మ॥ రక్తమాలధారిణీం । రజనీకరాననీం । భుక్తిముక్తిదాయినీం । బుధజనపరిపాలినీం ॥మ॥ రామదాసపాలినీం । రత్నమకుటధారిణీం । భూమిగుమ్మడిబాలపొరి । కామేశ్వరిశ్రీంశ్రీం॥

వ॥ ఒరే నేను శకటాసురుండను కంసరాజేంద్రుని యాజ్ఞాధారకుండను భుజవిక్రముండను. కృష్ణునివధింపవచ్చినాడను. (అని కృష్ణునితొట్లెవద్దకేతెంచి)

దర్వు.

చిక్కితివీ చిక్కితివీ చిక్కితివోరీ । చక్కగనాచేతికియిక దక్కవురోరీ ॥చి॥ ఒక్కగ్రుద్దుకేనిన్ను నొరగించెదరా । గ్రక్కునబుడబుడ రక్తముగ్రక్కించెదరా ॥చి॥ నల్లచీమవలెను నిన్నునలచివైతురా । నల్లనివాడా యెంతటిపిల్లడవోరా ॥చి॥ చక్కనిగుమ్మడిదాలా శౌరిరొనిన్నూ। నృక్కడంచి జగతిలో పింపెక్కెదనేనూ ॥చి॥

వ॥ ఒరేవిష్ణూ నీయాయువు నేటితోసరిపోయెను (అని సమీపించగా కృష్ణుడు పాదములతోతన్నుచు కేకలుబెట్టుచుండును)

య-వ॥ ఇదేమమ్మా ఈపిల్లవాడింతలోనే నిద్రించినట్లు నిద్రించి మళ్లీ ఏడ్చుచుండెను. (అని యశోద దగ్గరకువచ్చి చూడగా)

శ-వ॥ అబ్బా అబ్బా చస్తిచస్తి వీడుబాలుడుగాడు (అని నాలుకదెరచుకొని పడిపోవును)

య-వ॥ మాలతీ ఏదోచప్పుడయ్యెను చూతామురావే అమ్మయ్యో మళ్లీ ఒకరాక్షసుడువచ్చి మరణించెను. ఇదేమిపాపమమ్మా మాపిల్లవాడా రాక్షసులకేమి పగసేసెనమ్మా.

కం॥ గతజన్మంబునమేమే

వ్రతములజేసితిమొ । సత్యవాక్కులనైనన్

సతతముబ ల్కితిమోయీ
వెతలెల్లను దొలుగనయ్యో । విష్ణువ్రకరుణా॥

నం-వ॥ ప్రాణేశ్వరీ యిదియంతియు మాయగా దోచుచున్నది ఈపాపిరక్కసులు మనబాలుని జంపుటకై వచ్చుటేమి తుదకు వారే మరణించుటేమి ఎవరినైన జ్యోతిష్కులనడిగి తెలిసికొనవలయును.

యశ-వ॥ ఔను నాథా అటులే చేయవలెను.

నారదుడు ప్రవేశము.

దరు॥ నటనసూత్రధారిశౌరి । నారాయణగిరిధారీ । వటపత్రశాయి నిన్నువర్ణింపగనాతరమా ॥న॥ శంఖచక్రగదాధారి । పంకజాక్ష పాపహారి । మంటదైత్యసంహారీ । మహాదేవహితకారీ ॥న॥ ధరగుమ్మడిదాలవాస దామోదరహృషీకేశ । వరద్వారకంతవాస । కరివరదా లక్ష్మీశా ॥న॥

వ॥ నారాయణ నారాయణ

కం॥ ఇందిరాదేవివల్లభు
డందంబుగ దేవమాను । లార్తినిదీర్చన్
నందయశోదలకును తా
నందనుడై యుద్భవించె । ననవినివస్తి॥

వ॥ ఆహా నేడెంతసుదినము ఆవైకుంఠవాసుని కన్నులార దర్శించు భాగ్యము గల్గుచుండెను. నారాయణ నారాయణ (అని విచ్చేసిన నారదునిగని నందయశోదలు)

నం-వ॥ బ్రహ్మపుత్రా మీపాదపద్మంబులకివే ప్రణామంబు లాచరించువాడను.

యశ-వ॥ స్వామీ మీకివే వందనంబులు.

నా-వ॥ పుణ్యాత్ములారా మీకెల్లవేళల శుభంబగుగాక.

వాదం - దరు.

నం॥ పావనమయ్యె మాగృహమూ । బ్రహ్మపుత్ర నేడుసుదినమూ । దేవరవారేతెంచినకార్యము । కేవలముగ నేజేతునిత్తరిని ॥పా॥

వ॥ మునీంద్రా మీరిందు విచ్చేయుటచే మేము ధన్యులమైతిమి కాని తామెందునిమిత్తమై విచ్చేసియుంటిరో సెలవీయుడు.

నా॥ నందనీదుతనయునిజూాడా । యిందునువిచ్చేసినవాడా । సుంద రాంగుడని యందరనగ మన । సందుకోర్కెగలిగిందు వచ్చితిని ॥నం॥

వ॥ నందరాజా నీకొకకుమారుడు గలిగెననివిని చూచిపోవలెనని విచ్చేసితిని యింతేకాని వేరేపని యేమిలేదు.

య॥ మనమున సంతోషముదోచే । మునివరోయుదోగను నాసుతు డొచ్చే। పనిబూనియు మాపాపనికిని దీ। వనలిన్వుశి యూపదరాకుండను॥మ॥

వ॥ మునివర్యా ఇదో పీ కుమారుడు కృష్ణుడు వీడుజన్మించిన దాదిగా మాయరక్కసు లెందరోవచ్చి బాధపెట్టు చుండిరికాని మీవంటి పెద్దల అనుగ్రహముచే అన్నిగండములు కడతేరి పోవుచుండెను.

నా॥ తల్లియశోదా వినవమ్మా । యీ । పిల్లడు శ్రీవిష్ణువు సుమ్మా । యెల్లలోకముల నేలెడు వాడే । కల్లగాదు మీకడుపునబుట్టెను॥త॥

వ॥ యశోదాదేవీ యీబాలుడు సాక్షాత్ భగవదాంశ సంభూ తుడు అసురసంహారణార్థమై మీగర్భమందుద్భవించెను మీరేమాత్రము భయపడకుడు.

సం॥ చాలసంతసము దోచెనుగా । సంయమినీవాక్కులువినగా । మేలుగుమ్మాడి దాలపెంచెదను । లోలునివలె నీబాలునిజూతుము ॥చా॥

వ॥ నారదా నీవాక్యములు నిజమనే తోచుచున్నవి యికమేము నిర్భయముతో నుండెదము.

నా-వ॥ సరే అటులేయుండుడు యికనేనుబోయి వచ్చెదను. (అని నారదుండు వెడలిపోవుటయు నంతనొకనాడు)

రాధ ప్రవేశము (అలీబాబాలోని అందాల్లా పండెమేస్తా అనువలె)

దర్వు॥ అందాలరాశినమ్మా । అతివానే రాధనమ్మా । సుందారి చిన్నికృష్ణుని జూడావస్తినెకోమ్మా ॥అం॥ కమలాయతాక్షినమ్మా । కల హంసయానవమ్మా । రమణుడు నాదుభర్త । రసికాగ్రగణ్యుడమ్మా ॥అం॥ నవయవ్వనాంగినమ్మా । నందూనిచెల్లెలనమ్మా । భువనమోహితురా లను । [illegible] బాలనమ్మా । సఖమా ముద్దూలగుమ్మా । క్షితినీగుమ్మాడిదాల । శ్రీహరినీగొల్తునమ్మా ॥అం॥

సం-వ॥ అని రాధ యశోదనంజేరబోయి.

రా-వ॥ వదినా క్షేమమేనా కృష్ణునిజూడక చాలరోజులాయె నని వచ్చియుంటిని.

య-వ॥ రావమ్మా రాధమ్మా అదో మాకృష్ణునిజూడుము చా అల్లరి పిల్లవాడమ్మా (అనునంతలో కృష్ణుడు తల్లింజూచి యేమ చున్నాడన)

కృష్ణునికి యశోదకు వాదము.

కృ॥ అమ్మా నాకొకమురళీ । యిమ్మాగొని తెచ్చియూరు సమ్మతితో బాడుచునే । చక్కగ దిరుగాడెదాను॥

వ॥ అమ్మా నాకొక మురళినిదెచ్చిమ్ము నేనా బాలురతో గూడి ఆడుకొన బోయెదను.

య॥ తనయా వినరానీదగు । తండ్రితోడ నేజెప్పియు । కొని తెప్పించెద యావర । కును నీవల్లరిసేయకు ॥త॥

వ॥ కుమారా నీతండ్రి వచ్చినతోడనే చెప్పి తెప్పించియిచ్చెదను గాని నీవల్లరిసేయకుము.

కృ॥ యిప్పుడెగావలెనాకూ । యివ్వకున్న నేవిననూ । వొప్పుకోను నీవెన్ని । జెప్పిన తాళగలేనూ ॥యి॥

వ॥ నాకిప్పుడే గావలెను తెప్పించియిమ్ము (అని యేడ్చును)

య॥ తనయజిద్దుజేయకు నీ । తండ్రివిన్న దండించును । వినరా నామాటనీవు । యనునట్లే యిచ్చెదాను ॥త॥

వ॥ కృష్ణా నీవిట్లుజిద్దుజేసిన నాచేతగాదు నీతండ్రితో జెప్పి కొట్టించెదను, (అనిన రాధవిని)

రా॥ ముద్దులకృష్ణానీకు । మురళీగొనియిచ్చెదాను । జిద్దుజేయ బోకుము నా । వద్దికిరానీవికనూ ॥ ము॥

వ॥ కృష్ణా ఏడువకుము మాయింటికిపస్తేవా నీకు ఒకమురళేగాదు మంచిమంచి పక్వాన్నములుజేసి పెట్టెదను వస్తావా, (అనిన కృష్ణుండు తల్లింజూచి)

కృ॥ అమ్మా యెవరేమీామె । రమ్మనుచుండెనునన్నా । కమ్మని పక్వాన్నంబులు । కడుపునిండ నిడుదుననెను॥

వ॥ అమ్మా యీమెనరే నన్ను తనయింటికిరమ్మనుచుండెను. అంతేగాక నాకు కమ్మని వంటలుజేసి పెట్టుదుననుచుండెను.

య॥ తనయావిను యీపెయు నీ। తండ్రికి తోబుట్టువురా। అను వొందగనీకును మే। నత్తయు గావలెగదరా॥

వ॥ కుమారా ఈమె నీకు మేనత్తయగును. ఈమెపేరు రాధ పరాయివారుకారు వింటివా.

కృ॥ అమ్మా అటులైనను నే। నత్తింటికి బోయెదాను। కమ్మని ఫలహారమ్ములు। కడుపునిండగుడిచెదాను ॥అ॥

వ॥ అమ్మా నేనీ అత్తయింటికిబోయి వత్తునా.

రా॥ వింటివిగద కృష్ణుని మా। యింటికి గొనిపోయినేను। వెంట నెగొనివచ్చెద సెల। విమ్మువదినె కాదనకను ॥విం॥

వ॥ వదినా కృష్ణుని మాయింటికె గొనిపోయి యించుకసేపుంచు కొని మరలగొనివచ్చెదను కాదనక పంపించుము.

య॥ అయ్యో వలదందును నీ। వటులేగొనిపోయిరమ్మ। యివ్వే డగుమ్మడిదాలా। యీశుభెనిను మెచ్చునమ్మ॥

వ॥ రాధా వాడువస్తాననుచుంటె నేనువలదందునా అటులేగొని పోయి యించుకసేపాడించి ఫలమునూన్పించికొనిరమ్ము.

రా-వ॥ సరే అటులేగొనివచ్చెదను. కృష్ణారమ్ము మాయింటికి బోవుదము (అని రాధ కృష్ణుని తనయింటికిగొనివచ్చి కృష్ణునితో యేమను చున్నదనః)

రా-వ॥ కృష్ణా యిదియే మాగృహము.

కృ-వ॥ అత్తా మీయిల్లు చాలాబాగున్నది.

వాదం - దరువు.

రా॥ గారాననవమన్మథాకారా ఫలహారంబుల । కోరికలరా । సుముఖీరా ॥కో॥

వ॥ కృష్ణా ఈఫలహారంబులను భుజించి వీటిరుచి యెట్లున్నవో తెల్పుము చూచెదను.

కృ॥ యెంతో యిదిగనుదోచే యీలాటివి యెవ్వారును । యింత వరకూ । యిడరునాకూ ॥యిం॥

వ॥ అహా అత్తా నీవు వడ్డించిన పదార్థములరుచి యింతింతని చెప్ప రాదు. మాఅమ్మగూడ యిటువంటి వెన్నదును చేసిపెట్టియుండలేదు నీయుపకారమున కేమందును.

రా॥ యింకేమీ గావలయునో । యెరిగింపుము నాతోడను । పంకజాక్షా । పాపశిక్షా ॥పం॥

వ॥ కృష్ణా నీకింకేమిగావలయునో చెప్పుము యేమాత్రము సందేహపడకుము నేను మేనత్తనుగదా.

కృ॥ అత్తా నీమాటలకు । నానందముదోచేనా । చిత్తామందూ । శీలుజెందూ ॥చి॥

వ॥ అత్తా నీదయార్ద్ర చిత్తమునకు నాకెంతో ఆనందమనిపించెను నాకడుపునిండినది నాకింకేమియువలదు.

రా॥ మంచీవాడవుకృష్ణా । మనమిద్దరమొకచో ని । ద్రించగానూ। యెంచెదానూ ॥ని॥

వ॥ కృష్ణా ఇంచుకసేపు మనమిద్దరమొక్కచోట నిద్రించవలెనని కోరికగలుచున్నది రమ్ము ఆహంసతూలికా తల్పంబున పవళింతము.

కృ॥ సరెసరె నీవన్నట్టుల । శయనించెదమంచంబున । పరువము దోచే । మురిపెముదోచే ॥ప॥

వ॥ అత్తా నీవన్నట్టులనే శయనించెదము రమ్ము.

రా॥ ధరగుమ్మడిదాలా పురి । ధాముని చిత్రమదేమో : మరు లొందితినీ । మరినిన్నుగనీ ॥మ॥

వ॥ ఆహా కృష్ణా నీమోహనాకారంబును జూచినకొలది నాకేమో (అని యూరకుండును)

కృ-వ॥ అత్తా ఏమోఅనబోయి యూరకుంటివి. అదేమో తెల్ప రాదా నేను వినగూడదా.

రా-వ॥ నామదిలోనిమాట నీకుదెల్పుటకు సిగ్గగుచున్నది కృష్ణా.

కృ-వ॥ అత్తా సిగ్గెందులకు తెల్పరాదా.

రాధ దరువు.

(జీవితంలోని - నీకై నిన్నేవరించితీ నాపై కోపం)

నిన్నే నేనూ ప్రేమించితీ । నీలవర్ణామనోహరా

కృష్ణాకృష్ణా శ్రీకృష్ణా । కృష్ణాయదుకుల వర్ధిష్ణా ॥ని॥
సిన్నవాడవు సీవింకా । పెద్దవాడ వెపుడయ్యేవోకా
అన్నులనిన్నను శ్రీకృష్ణా దయ । నెన్నడు గలుగునో శ్రీకృష్ణా
కృష్ణాకృష్ణా శ్రీకృష్ణా । కృష్ణాయదుకుల వర్ధిష్ణా ॥ని॥
మోహనాంగ నినుగనచాలా । మోహము జనియించెనుతాళా
సాహసింపాదోచదుగా వని । సాగదంచూ నెంచెదగా
కృష్ణాకృష్ణా శ్రీకృష్ణా । కృష్ణాయదుకుల వర్ధిష్ణా ॥ని॥
పాలుగుడిచె బాలుడవీవూ రతి । కేళివరుస దెలియగలేవూ
మేలుగాదు గుమ్మడిదాలా శ్రీ । లోలు మాయదెలియగజాలా
కృష్ణాకృష్ణా శ్రీకృష్ణా । కృష్ణాయదుకుల వర్ధిష్ణా ॥ని॥

వ॥ అహా కృష్ణా నీ వెప్పుడు పెద్దవాడవయ్యెదవోకదా.

కృ-వ॥ ఏమీ నేను పెద్దవాడను గావలయునని నీకుండెనా అటులైన పెద్దవాడనయ్యే మంత్రమునాకొచ్చును.

రా-వ॥ అహా కృష్ణా పెద్దవాడవయ్యే మంత్రము నీకొచ్చునా అయితే గమ్ము చూచెదను'

కృ-వ॥ అత్తా నీవించుక కన్నులుమూసికొనుము నేపెద్దవాడనయ్యెదను (అనిన రాధ కన్నులుమూసుకొనును మరుక్షణమే) అత్తా నేను పెద్దవాడనైతిని చూడుము.

రా-వ॥ కృష్ణా నీవు సామాన్యుడవుగావు సాక్షాత్ పరమాత్ముడవేసుమా నీదివ్యమంగళ విగ్రహమును దర్శించిన నాజన్మము పవిత్రమయ్యెను. కాని యొకమనవి.

కృ-వ॥ అదేమిటి అత్తా.

వాదం - దరువు.

రా॥ వనజనేత్ర నిన్నుబొంద । వాంఛనాకు గల్గెనుగా । మునిజననుత నిన్నుగనగ । మోహముప్పతిల్లెనుగా ॥వ॥

వ॥ కృష్ణా నీసౌందర్యమును జూచినంతలో నాకు మోహంబగ్గలంబయ్యెను నన్నుగూడి నాకోరిక నెరవేర్చుము.

కృ॥ అత్తా యిదేటిమాట । లాడుచుంటివో తెలియా । చిత్తమెటుల నొప్పెనోకా । చిన్నవాడ నాతోగలియ ॥అ॥

వ॥ అత్తా నీమాట లతివిచిత్రంబునున్నవి. నేను మేనల్లుడనగుటచే నీకు కుమారునితో సమానుండనుగదా నన్నుగూడుమనుట న్యాయమగునా.

రా॥ వావివరుస లెక్కడివో । వనజాయత నేత్రనీకు । భూవలయము నంతటికీ । పురుషుండవు యట్లనకూ ॥వా॥

వ॥ కృష్ణా బ్రహ్మాండనాయకుండవగు నీకెక్కడి వావివరుసలు సమస్తమునకు నీవేభర్తవుగావా వెనుదీయక నాకోరిక నెరవేర్చుము నీకు మొక్కెదనను.

కృ॥ వనజాయతలోచని నీ । వాక్కులకే మెచ్చితిని । జనులిది విన్ననుకన్నను । మనలను నిందింతురవని ॥వ॥

వ॥ అత్తా నీవనుమాటలు సరేకాని మనమిట్లుజేసిన లోకులునిందించరా కావున యీదుర్బుద్ధి మానుము నామాటవినుము.

రా॥ నిందజేయు యజ్ఞానుల । కిందునీవు వెరువనేల । సుందరాంగి నగునాతో । పొందుజేయుగోపాలా ॥నిం॥

వ॥ అజ్ఞానులగు మానవులకై వెరువనేల రమ్ము నాకోకగాఢాలింగనంబిమ్ము నావిరహానలంబు జల్లార్పుము.

కృ॥ యిదివిన్నను నీమొగండు । యింటనుండ నివడునిన్ను । మది లోన విచారించుము । మంచిదిగాదీపనియును ॥యి॥

వ॥ అత్తా యీగుట్టు నీమొగడేవిన్న నిన్నింట నుండనిచ్చునా బాగా అలోచించుకొనుము'

రా॥ అన్నిటికినినీవే నా । కాధారంబనియంటిని। వెన్నుడనాకోర్కెదీర్చ । కున్న నిన్నువిడనంటిని ॥అ॥

వ॥ కృష్ణా సర్వానికి నీవేయనినమ్మికున్న నాకేలాటి విపత్తులు రానేరవు. నాకోరిక నెరవేర్చుము వలదన్న వినుదాననుగాను.

కృ॥ ధరగుమ్మడిదాలపోరి । ధాముడ నీకోరికలను । నెరవేర్చెద వెరువబోకు । నీలాలకిరమ్మియిక ను ॥ధ॥

వ॥ అత్తా నిన్ను పరీక్షించుటకై యిట్లనుచుంటిని గాని నాకు మాత్రము నీతో రమింపవలెనని లేదా రమ్ము. నాకోక గాఢాలింగనంబిమ్ము (అని యిటులనుచున్నంతలో)

రాధభర్త ప్రవేశము.

దరువు॥ రమణుండను నేరాధాభర్తను । కమనీయాంగుడ నేవినరా। సుమశరురూపుడ సుజనప్రియుడను । సమయోచితవాక్శీలుడరా ॥ర॥ పొద్దుబొడువకముందేలేచియు । సద్దియన్నమును గుడిచెదరా । ముద్దుగ గొంగడి ముల్లుగర్రిగొని । పెద్దలమేపగల బోయెదరా ॥ర॥ యిలలో వెలసిన గుమ్మడిదాల । జలజాక్షుని స్మరియించెదరా । వలనొప్పగసంసార కృత్యముల । వాంఛతోడ నెరవేర్చెదరా ॥ర॥

సం-వ॥ ఇటులా రమణుండువచ్చి తనయింటి తలుపులుమూసి యుండుటజూచి యేమనుచున్నాడన.

రమణుని దరువు.

ఏమేనోభామ తల్పులేమొ మూసియింటిలో నీ । వేమిజేయుచుంటివో రావే । తల్పులనుదీయు । లేమాతడవాయెనుగదవే॥ మందకేగి వస్తినేను । మధ్యాహ్నముగావచ్చెను । యిందువదని యాకలివలనా । తాళంగలేను । యెందుకుయాలిస్యముచానా ॥ఏ॥

వ॥ పలుకవేమే ఏమిజేయుచుంటివి.

రా-వ॥ కృష్ణా నాభర్తవేంచేసి పిలచుచుండెను నీవు వెంటనే చిన్నవాడవుగమ్ము.

కృ-వ॥ తాళుతాళుము చిన్నవాడనయ్యే మంత్రము జ్ఞప్తికి రాకుండెను.

రా-వ॥ అయ్యో అయ్యో కృష్ణా ఇక ఎట్లు నీపుణ్యముంటుంది తొందగా చిన్నవాడవుగమ్ము.

కృ-వ॥ నీతొందరకా మంత్రమే జ్ఞప్తికివచ్చుటలేదు. నేనీమంచముపై కప్పుకొని పరుండెదను నీభర్త అడిగితే నీచెల్లెలని చెప్పుము (అని కృష్ణుడు నిండాకప్పుకొని పరుండియుండును. అంత రాధ తలుపుదెరసిన రమణుడు యింటిలోప్రవేశించి యేమనుచున్నాడన)

వాదం - దరువు.

ర॥ ఏమిజేయుచుంటివే । యేలబలుకకుంటివే । భామనీవు యెవనితోడభామలాడు చుంటివే ॥ఏ॥

వ॥ ఒసే పిలచిపిలచి నానోరెండుకపోయను యింతవరకు నీవెవ నితో మాట్లాడుచుంటివో తెల్పుము తెల్పకున్న నీపీపు చిట్లగొట్టెదను.

రా॥ రోసంయింతేనా మానమూ । మెవరునిన్న హీనమూ । చాలును యూర్కుండుము నీ । కేల యీవిచారమూ ॥యే॥

వ॥ నీకెప్పుడిదే అనుమానము తలుపుదీయుట కించుకాలస్యమైనచో యింతకోపమా.

ర॥ దోసకారీవినగదే । నను । మోసగించాజెల్లదే । వాసిగానటు పండుకున్న వాడెవండో తెల్పవే ॥దో॥

వ॥ ఒసే నన్నానీవు మోసపుచ్చుదువు ముందా పండుకున్నవాడెవడో డెల్పుము. ఊ

రా॥ చెల్లునా యీమాటలూ । అదిచంద్రికళ నాచెల్లెలూ । చల్లయన్నము దినియునీవిక । వెళ్ళుయేలనీవాదులూ ॥చె॥

వ॥ అది నాచెల్లెలగు చంద్రికళ నన్నుజూచి పోవలెనని వచ్చియున్నది నీవధికప్రసంగములు మాని కడుపునిండదిని మందికుబొమ్ము.

ర॥ నమ్మనూ నీమాటలూ । చూ । పిమ్మగదె నీచెల్లెలూ । యిమ్మహీ గుమ్మాడిదాల । యీశుడెరుగు నీసేతలూ ॥న॥

వ॥ ఏదీ నీచెల్లెలేనా చూచెద (అని కృష్ణుడు కప్పకొనియున్న వస్త్రమును తొలగించి చూచినంతలో కృష్ణుడు చంద్రికళగామారిపోవును అదిజూచి రమణుడు పెదవివిరచి) సఖీమణీ లేనిపోని తప్పను నీపై ఘటించితిని నాతప్పాక్షమించి నాకన్నంబిడుము తిని మందకేగెదను. (అని రమణుడు భోజనముజేసి వెడలిపోవుయుటనంత)

రాధ - దరు.

ఎంతోచిత్రముగను దోచెనూ । శ్రీకృష్ణుడు తా । నింతిగాను మారిపోయెనూ । యెంతమోసమౌను । ప్రాణకాంతుడిట్టి గుట్టుదెలియ యింతలోనె నాకాభగవంతుడేమొ సాయపడెను ॥ఎం॥ సామాన్యుడు గాడు కృష్ణుడూ । తాననుకొన్న । యేపనైనజేయగలండూ । ప్రేమతోడ నాకొరకై । పెద్దవాడుగాతానై । నాగుదిగలకోర్కెదీర్చి నాకెంతో ప్రియముదోచె ॥ఎం॥ ధరగుమ్మడిదాల వాసుడూ । యీశరిరాజ । వర

దుడె యీచిన్నికృష్ణుడూ । కరమరుదుగ భక్తజనుల । కష్టములను కడ తేర్చగ । ధరలోనవతారమెత్తె ధన్యురాలనైతినినే ॥ఎం॥

కృ-వ॥ అత్తా ఏమిజేయుచుంటివి రమ్మా.

రా-వ॥ కృష్ణా నీవెంతటి మాయకాడవయ్యా.

కృ-వ॥ అదిసరేకాని మాయమ్మ నాకొరకు యెదిరిచూచుచుండ వచ్చును. నేనిప్పుడే చిన్నవాడనయ్యేదను నన్నుగొనిపోయి మాఅమ్మ వద్ద దించిరమ్మా.

రా-వ॥ అటులే దించివచ్చెదను గాని మళ్ళీనేను రమ్మన్నప్పుడు తప్పకుండ రావలెను.

కృ-వ॥ అట్లే వచ్చెదను. (అని చిన్నవాడగును. అంత రాధ కృష్ణునెత్తుకొని యశోదవద్ద దింపివచ్చును)

కృష్ణయశోద వాదం - (తేరెశివా)

కృ॥ ఆటలాడబోదునాకు । నాజ్ఞనివ్వవే । పాటబాడుకొనుచూ నాతోటి బాలకులగూడి ॥ఆ॥

వ॥ అమ్మా నాతోటి బాలకులతోగూడి ఆటలాడుకొని వచ్చెదను.

య॥ వలదుర నీవాటలాడవలదు పోవలదు । నలువురునినుగని యోర్వగలరా నామాటవినుము ॥వ॥

వ॥ తనయా నిన్నుజూచి జనులు యోర్వరుకాబట్టి నీవింటిలోనే యుండి యాటలాడుకొనుము.

కృ॥ కొంతసేపు యాటలాడుకొని వచ్చెదనే । మంతనమునయుండగ నామనసొప్పక నుండెగాన ॥కొం॥

వ॥ అమ్మా నన్నెవరేమి యనజాలరు నేనెవ్వరినేమనను ఆటలాడుకొని త్వరగానేవచ్చెదను.

య॥ సరెరా అటులైనబోయి జనుదెంచుమికా । ధరగుమ్మడిదాల పోరి ధాముడునినుమెచ్చునటుల ॥స॥

వ॥ కుమారా అటులైన నిపుడేపోయి బాలురతో నాటలాడుకొని రమ్మా యెవ్వరినేమనకుము.

కృష్ణుని - దరువు.

రండోబాలులా । మీరందరునిటు । రండీగోపాలబాలురా । రండి

మనమందరాము నిండూసంతోషమూన । అంజబాయకుండ నేడు యాట
లాడుకుందాము ॥రం॥ జట్లుజట్లుగాను గొల్లబోంట్లలోనజొచ్చి। యిట్లమీాది
కుండలాకు తూట్లుబొడచివత్తాము ॥రం॥ మురళిపాటబాడుచు నేముందు
ముందు నడచెదాను । వెరుపేమిజెందక నా । వెంట మీారలంతగూడి ॥రం॥

వ॥ ఒరే మల్లన్నా యెల్లన్నా పుల్లన్నా రాండి మనమందరము
ఆటలాడుకొందము.

బాలురు-వ॥ కృష్ణా యిదోవస్తిమి మనమీావ్యాళ యేఆటలాడు
దాము.

కృష్ణునకు బాలురకు వాదం.

కృ॥ చిరికిబిల్లలాడుదాము । చిర్రెగోనెలాడుదాము । మురళిపాట
బాడుదాము । మురిపెముతో దిరుగుదాము ॥చి॥

వ॥ చిరికిబిల్లలాడి అటుపిమ్మట చిర్రెగోనెలాడుదాము.

బా॥ తప్పకుండ నేడుమనము । వుప్పాటలాడుదాము । గొప్ప
పేరుదెత్తాము । యెప్పటికైనను మనమూ ॥త॥

వ॥ కృష్ణా మనము ఉప్పాటాడనాకు కోరికయున్నది. ఏమందువు.

కృ॥ బారులేమొ దీరిమనము । బంతియాటలాడుదాము । మీారె
గెలచెదరొ లేక । మేమె గెలతుమొాయిపుడు ॥బా॥

వ॥ మనము బంతియాట ఆడుదాము రండు.

బా॥ ధరగుమ్మడిదాలపారి । హరిమనలను జూచియాను । సరి
ఖళియని మెచ్చుకొనగ । సాగెదనాడంగవలయును ॥ధ॥

వ॥ ఒరే మల్లన్నా అదుగో కృష్ణుడు మన్నుదినుచున్న డేమిరా.

మ-వ॥ ఔనురా (కృష్ణునిజూచి) కృష్ణా మీాయింటిలో పక్వా
న్నములుండగా మన్నును దినుచుంటివే.

కృ-వ॥ ఛీ సర్వామబద్ధము నేనెందుకుదిందును. గతిలేనివారు
మీారు దిందురు.

మ-వ॥ మేము గతిలేనివారమా సరే మీాఅమ్మతో జెప్పి నీకు బుద్ధి
జెప్పించెదను ఒరేయెల్లన్నా రారా యశోదమ్మతో జెప్పదాం (అని గోప
బాలురు యశోదవద్దకువచ్చి యేమనుచున్నారన)

—వ॥ ఓశోదమ్మా వింటివా.

య-వ॥ బాలులారా ఏమిసమాచారము.

వాదం - దర్వు.

బా॥ మన్నుదిన్నడమ్మా । కృష్ణుడు । మన్నుదిన్నడమ్మా । మన్ను దినగ మీయింటిలోపలను । వెన్నలేదొ పక్వాన్నములేదొ ॥మ॥

వ॥ యశోదమ్మా మీకృష్ణుడదేమోకాని మేమిందరము జూచు చుండగా మన్నునుదిని యుండెను వింటివా.

య॥ మన్నుదింటివటరా । బాలుర । మాటలు నిజమటరా । కన్నతండ్రి నీకాకలిమైనచొ । వెన్నలేద పక్వాన్నములేదా ॥మ॥

వ॥ కృష్ణా మన్నుదింటివట నిజమేనా చెప్పుము నీకేమిగ్రహచా రమురా మనయింట మంచిమంచి పక్వాన్నములు లేకుండెనా.

కృ॥ వట్టిమాటలఽమ్మా । విను నీ । వొట్టునమ్మమమ్మా । గట్టి గాను ననుగొట్టించగ పగ । బట్టివీరలిటు బలుకుచునుండిరి ॥వ॥

వ॥ తల్లీ యీబాలురు జెప్పినదంతయు నబద్ధము నాపై పగబట్టి నన్ను నీవుగొట్టవలెనని చెప్పుచుండిరేగాని వేరుగాదు. మన్నుదినుటకు నేనేమి చిన్నపిల్లవాడనా.

బా॥ కన్నులార మేమూ । జూచియు । విన్నవించినామూ । మెన్న డులేనిది యేలనిట్టులను । విన్నవించెదము విరసమవాకూ ॥క॥

వ॥ యశోదమ్మా మేమబద్ధమాడము కావలెనన్న కృష్ణుని నోరు తెరచి చూడుము.

య॥ సారసాక్షవినరా నీదగు । నోరిటు తెరవుమురా । వీరిమా టలే నిజమైనచొ ని । న్నేరీతిగ దండింతునొ చూడుము ॥సా॥

వ॥ కృష్ణా ఏదీ నీనోరుతెరవు చూచెదను వీరిమాట నిజమైమై నచో దండించెదను.

కృ॥ జననియిదుగొచూడూ । నీదగు । అనుమానముపీడూ । విను గుమ్మడిదాల విష్ణురూపుడను । ఘనతరనావక్త్రము నేదెరచితి ॥జ॥

వ॥ అమ్మా యిదోచూడుము. (అని శ్రీకృష్ణుండు నోరుతెరచి చూపగా ఆనోటిలో అండపిండబ్రహ్మాండమంతయు గానంబడిన యశోదా దేవి మిగులభయమంది తనలోతాను ఏమనుకొను చున్నదన)

మ॥ కలయో వైష్ణవమాయయో యితరసంకల్పార్థమో సత్యమో। తలపన్నేరక యున్నదాననో యశోదాదేవిగానో పర। స్థలమో బాలకుడెంత యీతనిముఖస్థంబై యజాండంబు ప్ర। జ్వలమై యుండుట కేమి హేతువో మహాశ్చర్యంబు జింతింపగన్॥

వ॥ అహా యిదేమి ఆశ్చర్యము. ఈబాలకుని నోటిలో బ్రహ్మాండము గానుపించుచుండెను వీడు సాక్షాత్తుపరమాత్ముడే కాని వేరుగాదు. ఆహా నాభాగ్యమే భాగ్యము. ఈపురాణపురుషునిగని నేను ధన్యురాలనైతిని. అని కన్నులుమూసుకొని స్మరించుచున్నంత)

కృ-వ॥ అమ్మా నేను మన్నుదిన్నది నిజమేనా.

య-వ॥ లేదు నాయనా లేదు యాబాలు రజ్ఞానులగుటచే అట్లు బలుకుచుండిరి రమ్మా నీపకడుపునిండ వెన్నబెట్టెదను. (అని కృష్ణయశోదలు లోనకుప్రవేశించుటయు నంత)

గోపికలు పునఃప్రవేశము.

దరు॥ తెల్లవారెనూ।చల్లలుజేతుము। చెల్లెల లేలెమ్మా। యిల్లునూడ్చి పనులెల్ల జేసికొని। చల్లలమ్మబోదము మనమిప్పుడు॥తె॥ పాలుపెరుగులా కుండలనీవిటు బట్టుక రాగదవే। వేళాయనునిక వెన్నదీయవలె। బాలుడులేచిన పనిజేయనివడు ॥తె॥ సాటివారలూ చల్లలెత్తుకొని సాగిపోయిరిగదే। మేటిగుమ్మడీదాల పోరియా। హాటకాంబరుని యభినుతిజేతము ॥తె॥

వ॥ చెల్లెలా ఆవుట్లమీది కుండలు నిటుదెమ్ము.

చె-వ॥ అక్కా- ఉట్లమీదబెట్టిన కుండలన్ని పట్టిగానుండెను అందులోని పెరుగేమయ్యెను.

వాదం - దరువు.

(కలువరమాయే మలో - అనువలె)

చె॥ ఎరుగనైతి నీమాయా। యీమాయా। పరగకుండలో పెరుగంతయు నే। ర్పడకుండగ నెవ్వరుగాజేసిరో ॥ఎ॥

వ॥ నేడదేమోకాని తెలియకుండెను. ఈపెరుగంతయు నెవరుగాజేసిరోకదా.

అ॥ చెల్లెలవినుయటుగాదూ । యటుగాదూ । పిల్లివచ్చిత్రాగెనో పెరుగంతయు । యల్లరేల మనయత్త వినగలదు ॥చె॥

వ॥ చెల్లెలా పిల్లులేమైనవచ్చి తాగియుండవచ్చును కాస్త మెల్లగామాట్లాడుము మనఅత్తవినెనా యిల్లంత ఒక్కటిజేయును.

చె॥ వుట్టిమీాద నేరాత్రీ । నేరాత్రీ । పెట్టినకుండలు పెట్టినటుండియు । వట్టిదయ్యెలోపలి పెరుగంతయు ॥వు॥

వ॥ అక్కా నిన్నరాత్రి నేనుట్టిమీాదబెట్టిన కుండలుబెట్టినటులేయుండెను. కాని పెరుగంతయు మాయమయ్యెను.

అ॥ చోరులపని యిదిగానీ । యిదిగానీ । వేరుగాదు యీావేళ మనము యాా । చోరునిబట్టియు । ధీరతోగడుదము ॥చో॥

వ॥ చెల్లెలా నేటిరాత్రి మనము మెలకువతోనుండి ఆదొంగయెవడో కనిపెట్టి పట్టుకొందము.

చె॥ సరె అటులేజేయుదమూా । జేయుదమూా । ధరశ్రీగుమ్మడిదాలలో వెలసిన । పరమాత్ముడె మనపాలిటగలడిక ॥స॥

సం-వ॥ అని యిటులనుచున్నంతలో ఆగోపికల అత్తవచ్చి వారితోయేమనుచున్నదన.

అత్త-క॥ వేకువజామున లేచియు । ప్రాకటముగ యింటిలోని పనులొనరించి । ఈకొని పాలుంబెరుగును । చేకొనిపోకుంటిరేమి జేయుదు మిమ్ము॥

వ॥ ఒసే ప్రొద్దుననేలేచి యింటిపనులెల్ల జేసికొని చల్లలమ్ముకొనిరాండేంటె ఏమేమో ముచ్చట్లు బెట్టున్నరేంటే.

కోడలు-వ॥ అత్తా నిన్నరాత్రి మేము ఉట్లమీాదబెట్టిన కుండలు పెట్టినట్లే యుండెనుగాని అందులో ఒకపెరుగుచుక్కలేకుండా మాయమయ్యెను. అదేమాట్లాడుచు ఎటుదోచకుండా యుంటిమి.

అత్త కోడండ్రవాదం.

అ॥ ఎక్కడనేర్చితిరే యిా । టక్కరివేషంబులాను ॥ట॥ యెక్కడికేగెను పెరుగూ । యేమందును మిమ్ములాను ॥ఎ॥

వ॥ ఈటక్కరిమాటలతో నాకక్కరలేదు ఆపెరుగంత నేమయ్యెనో తెల్పుడు నేనూరకుండు దాననుగాను.

కో॥ ఉట్టిమీద నిన్నరాత్రి । బెట్టినట్టికుండలూను ॥పె॥ పెట్టినట్లె యుండెకాని । పెరుగుమాయమయ్యేను ॥ఉ॥

వ॥ అత్తా ఆపరమాత్ముని సాక్షి మేమెరుగము. ఏఒట్టుదినుమంటె ఆవొట్టు దినెదము.

అ॥ ఒట్లుగిట్లు బెట్టుకుంటె । వొప్పుదాననేనుగాను ॥వొ॥ యిట్లు జేస్తె మీవీపులు । చిట్లగొట్ట కూర్కుండను ॥ఒ॥

వ॥ మీకు పెద్దాచిన్నాయున్నదా కండకావరంబున నోడలెరుంగక నాసంసారమంత పాడుజేయుచుంటిరి మిమ్మిప్పుడేమిజేసెదనో చూడుడు (అని చీపురుగొనివచ్చి కొట్టబోవును)

కో॥ యింతవరకు అత్తవంచు । యెటులన్నను వోర్చితీమి ॥యె॥ యెంతవకు నీతోడను । యేగవలెను యూర్కుండుమి ॥యం॥

వ॥ పెద్దదానవని నీమర్యాదగాపాడితే మమ్ముల చీపురుతో గొట్ట వచ్చెదవా (అని కోడండ్రిరువురు అత్తను గొట్టుచుందురు ముసలిది మొత్తుకొనుచుండును అదివిని లోపలినుండి కొడుకువచ్చి)

కో॥ వలదువలదు కోడండ్రతో । వాదులాడబోకెతల్లి ॥వా॥ యిలలోయెవరైనవిన్న । హీనముగాదాతల్లీ ॥వ॥

వ॥ అమ్మా పెత్తనానికి దిగిచి కూర్చుండక ఎప్పుడు కోడండ్రతో కొట్లాడుచుందువు యెవరైనవిన్న నేమందురు ఊరకోరాదా.

అ॥ యిల్లాండ్రను వెనుకేసుక । యిట్లుబల్కవేటికిరా ॥యి॥ తల్లినై నననుగాదన । ధర్మమెట్లునీకగురా ॥యి॥

వ॥ ఒరే నీపెండ్లాలను వెనుకేసుకొని నాదేతప్పందువా సరే నేను చెరువో బావో చూచుకొనెదను మీరే మంచిగానుండండి.

కో॥ కటకట యిదియేమొనాకు । యెటుదోచకనుండెనుగా ॥యె॥ పటుతర గుమ్మడిదాల । పరమాత్మబ్రోవుమికా ॥క॥

వ॥ అమ్మా నేనేమంటినే నిన్ను కొట్లాడకుమంటినేగాని వేరు గాదు. (అని తనభార్యలంజూచి)

భార్యాభర్తల వాదము.

(కీలుగుఱ్ఱంలోని - చెంపవేసినా కింపుగూర్చితివి)

భ॥ వద్దువద్దు మాతల్లితోడనిటు । వాదులాడకే పెద్దదానా ।

యిటువాదులాడకే చిన్నదానా । పెద్దదగుటయది జెప్పినట్లువిని । బుద్ధి దెచ్చుకోండికనైనా ॥వ॥

వ॥ మానినీమణులారా మాతల్లితో వాదులాడెదరు. ఆముసలిది మిమ్ముల నేమన్నది.

భా॥ తల్లిని వెనుకేసుక మాట్లాడెవు । ధర్మమానయిది వన్నె కాడా । నీధర్మమానయిది వన్నె కాడా । యిల్లాండ్రిముమము హీనపర చితివి । యెందుకుయిటనుండముగానా ॥త॥

వ॥ సరే మంచిగానే మాట్లాడితివి నీతల్లితప్పు విచారించకుండా మాకే బుద్ధిజెప్పుచుంటివి మంచిమొగడవే మేమిట ఒకక్షణమైనాయుం డక మాపుట్టింటికేగెదము వింటివా.

భ॥ కలసిమెలసి కూడుండుమంటె యిటు । లలగుటయెందుకె పెద్ద దానా । నీ । వలుగుటయెందుకె చిన్నదానా । కలహకారణంబేమో నాకూ । తెలుపరైతిరింతకునైనా ॥క॥

వ॥ నేను అత్తాకోడండ్రు మంచిగా కలసిమెలసి యుండుమంటినే కాని మిమ్మేమనలేదు ఎందుకలిగెదరు. కాని యీకలహకారణమేమో నాకుదెల్పిన తప్పెవరిదో విచారించెదను.

భా॥ వుట్లమీదిపెరుగంతయు యెట్లో । యత్తదయ్యెనో వన్నె కాడా । వుత్తదయ్యెనో వన్నె కాడా । కొట్లాటకు మూలంబయ్యెను యీపట్లవింటివయికనైనా ॥వు॥

వ॥ నిన్నరాత్రి మేముట్లమీదబెట్టిన కుండలలోని పెరుగంతయు నెవరో కాజేసిరి మేమేతాగినామని మీతల్లి మమ్ములదిట్టికొట్టు చుండెను.

భ॥ సరెసరె మీతప్పేమిలేదనీ । యెరిగితినేవా పెద్దనాదా । నేనె రిగితినేవా చిన్నదానా । ధరవెలవెలసి శ్రీగుమ్మడిదాల । పురి శ్రీహరిపని యిదిగానా ॥స॥

వ॥ భామలారా యిదియంతయు ఆకరోడ్రుచేసిన పనిగాని వేరు గాదు. ఇందులో మీదేమాత్రము తప్పులేదు మనమందరము నేడు మెల కువగానుండి ఆచోరుని పట్టవలెను వింటిరా.

తల్లి-వ॥ ఔనురా అటులే జేయుదముపదండి.

## గోపికలు చల్లలమ్మబోవుట.

దర్వు॥ చల్లోయమ్మాచల్లా । చవిజూచిగొనుడి జనులెల్లా ॥చ॥ చల్లదావిరిమీ యుల్లముఁరంజిలు । కల్లగాదుమావల్లభుసాక్షిగ ॥చ॥ పెరుగోయమ్మా పెరుగూ । యీపెరుగుదావిర వ్యధదరుగూ । పెరుగిది మీగడపెరుగు ద్రావినచో । మెరుగెక్కీయు మీమేనులుశోభిలు ॥పె॥ వెన్నోయమ్మా వెన్నా । యీవెన్నగొనుడి యేమన్నా । వెన్నదిన్నమీ కున్న వ్యాకులము । లన్ని నశించును పన్నుగవినుడిక ॥వె॥ ఘృతమో యమ్మా ఘృతమూ । మాఘృతముగొనుడి సంతతమూ । కుతుకము తో శ్రీగుమ్మడిదాలా । పతితపావనుడు పానముజేసెడు ॥ఘృ॥

సం-వ॥ ఇటుల వచ్చుచున్న గోపికాంగనల నడ్డగించి కృష్ణుడేమను చున్నాడన.

## కృష్ణునికి గోపికకువాదం.

కృ॥ చల్లలమ్మబొయ్యేటి గొల్లభామా । నాతో । మళ్ళిచూచి మాటలాడు గొల్లభామా ॥చ॥

వ॥ భామా కాస్త నిలచి మాట్లాడుము.

గో॥ మాటలాడవేళగాదు కృష్ణమూర్తి । నా । తోటి నీకేమివ నియు కృష్ణమూర్తి ॥మా॥

వ॥ కృష్ణా నన్నుబోనిమ్ము ఇప్పటికే చాలపొద్దయ్యెను.

కృ॥ సుందరాంగినిన్నుజూచి గొల్లభామా । నీ । పొందుగోరి యున్నవాడ గొల్లభామా ॥సుం॥

వ॥ సుందరాంగీ నిన్నుజూడగానే నాకెంతో ఆనందమనుపించెను నాతో మరుకేళిగూడిపొమ్ము నీవడిగినదిచ్చెదను.

గో॥ ఎంతకొంటెవాడవౌర కృష్ణమూర్తి । జేనెడంత లేవుచూడ బోతె కృష్ణమూర్తి ॥ఎం॥

వ॥ కృష్ణా నీవుచూడబోతే జానెడులేవుగాని ఈకొంటెబుద్ధు లెక్కడనేర్చితివి చాలు నూరకుండుము.

కృ॥ పెద్దవాడనైతిచూడు గొల్లభామా । నా । వద్దజేరికౌగిలిమ్మ గొల్లభామా ॥పె॥

వ॥ సుందరీ యిదో నేపెద్దవాడనై తిని జూడుము నాకోరికముద్దిచ్చి నాకోరిక దీర్చుము.

గో॥ కొత్తాకోడాలనయ్య కృష్ణమూర్తి । మా । యత్తనన్ను గొట్టు నయ్య కృష్ణమూర్తి ॥కొ॥

వ॥ కృష్ణా నన్నుబోనిమ్ము ఆలస్యమైనచో మాయత్త నన్నుగొట్ట గలదు సుమా.

కృ॥ మత్తేభయానరమ్మి గొల్లభామా । మీ । యత్తకొడునేనె గాద గొల్లభా ॥మ॥

వ॥ భామా ఏలనికింతభయము నాకోరికముద్దిమ్ము.

గో॥ తగదుతగదు యిట్టిమాట కృష్ణమూర్తి । నా । మొగడుచాల కోపగాండ్ కృష్ణమూర్తి ॥

వ॥ కృష్ణా నామొగడిది విన్నచో నిన్నేమిజేయునో విచారించు కొని తొలగిపొమ్ము.

కృ॥ జగములేలువాడనేను గొల్లభామా । నీ । మొగడనంగ నెంతవాడు గొల్లభామా॥

వ॥ కోమలాంగీ అండపిండ బ్రహ్మాండనాయకుండనగు నాయెదుట నీమొగడనంగ నెంతటివాడు రారమ్ము. హాతంబు జేయకుము.

గో॥ దండమైనబెట్టెదాను కృష్ణమూర్తి । నీ । దాసురాలనన్ను విడుము కృష్ణమూర్తి ॥దం॥

వ॥ కృష్ణా నీవు పరమాత్ముడవని తెలియక నిట్లాడితిని నాతప్పు క్షమించి యిప్పటికి విడచిపెట్టితివేని మరొకసారి నీకోరిక దీర్చెదను.

కృ॥ అండజాక్షితప్పబోకు గొల్లభామా । కూ । ష్మాండపారివాసు డాను గొల్లభామా ॥అం॥

సం-వ॥ అనిపలికి కృష్ణుండు వెడలిపోవుటయు నంతనొకనాడు గోపిక లందరు గుమిగూడివచ్చి యశోదాదేవితో నేమనున్నారన.

## వాదం - దరువు.

గో॥ తాళగలేము యశోదా । నీ । తనయునితో యికమీాదా బాలుడెగానీ పడచువానివలె । వేళాకోళము జేయుచుండెను ॥తా॥

వ॥ యశోదా నీకుమారుడు జేయు దుడుకుచేష్టలకు మేమోర్వజాల కున్నారము.

య॥ యేమిజేసినాడమ్మా । నా । కెరిగింపుడిపూయమ్మా । కోమల మెందుకు కొట్టెదవానిని । కామినీమణులు కరుణించుడినను ॥యే॥

వ॥ మాకృష్ణుడేమిజేసెనో తెల్పుడు వానినిప్పుడే మీయెదుట దండించెదను.

గో॥ నిన్నటిదినమందుననూ । మా । చిన్నదొంటిగుండగనూ । విన్నావామీ వెన్నుడువచ్చియు । కన్నుగీటి సైగలుజేసినడట ॥ని॥

వ: అమ్మా మాకోడలిపిల్ల ఒంటిగా నుండగాజూచి రతికేళికి రమ్మని కన్నుగీటినాడట వింటివా.

య॥ తనయాయిదియేమిటిరా । యీ । పనులుజేయ తగునటరా। వినరా నీవీవనితలయిండ్లకు । జనుటేలను యీజగడములేలను ॥త॥

వ॥ కృష్ణా నీవీగోపికలయిండ్లకు బోవుటేమి యీకొంటెచేష్టలేమి యిట్లయితె నేనుసహించను వింటివా.

కృ॥ అమ్మరొవినుమ తెల్పెదనూ । నే । నాటలాడుచుండగనూ । రమ్మనినను యీరమణిబిలచుకొని । మమ్మారులు ననుముద్దులుగొని యెను ॥అ॥

వ॥ అమ్మా వీరన్నదంతయు నబద్ధమే నన్నే యీలేమబిలచుకొని నాచెంపలు ముద్దుబెట్టుకొని పంపెను.

య॥ చిన్నిబాలు నటుబిలువా । నీకు సిగ్గదెలేదేమగువా । పన్నగమీదగు పతులుండగ నా । కన్నసుతుని బలుకరించన్యాయమ ॥చి॥

వ॥ ప్రపంచజ్ఞానములేని పసిబాలునితోడనా మీసయ్యాటలు చాలు నూరుకుండుడు.

గో॥ తనయునితప్పటునుంచీ । మ । మ్మనుచుంటివి బెదరించీ । ధనవంతులు మీరనునదెజెల్లును । మనమునయించుక మరియాదెంచుము॥

వ॥ నీకొడుకుజేసిన కొంటెపనులనటుంచి మమ్మే బెదరించుచుంటివా యిటువినుము.

౧ గో-క౦॥ ఓయమ్మ నీకుమారుడు

హాయిండ్లను పాలుపెరుగు । మననీడమ్మా

పోయెద మెక్కడికైనను
మాయన్నలసురభులాన । మంజులవాణీ॥

యశో-వ॥ అదేమే మీరెందుపోయెదరు మాకృష్ణునికి నేను బుద్ధి జెప్పెదనులే.

౨ గో-వ॥ ఏమిబుద్ధిజెప్పెదవో యేమో.

యశో-వ॥ అదేమమ్మా అట్లనుచుంటిరి మావాడింకేమి గావించెనో చెప్పుము.

౨ గో-కం॥ నాకొడుకును నాకోడలు
ఏకముగను పెనగపాము । నీతడువైవగా
కోకలెరుంగక పారిరి
కూకవిడెన్ నీసుతుండు । గుణమెగుణాఢ్యా॥

వ॥ ఇది మంచిపనేనా నీవేచెప్పుము.

యశో-వ॥ తల్లులారా నన్నుక్షమించి యీసారికివెడలిపొండు కృష్ణుని బాగాదండించి మీజోలికిరాకుండ జేసెదను.

గో-వ॥ సరే అట్లేజేయుము పోవువారము (అని గోపికలునిష్క్రమింతురు.) నారదుడు మరలప్రవేశము.

దరువు॥ జయజయనంద యశోదానందన । జయజయఆశ్రితపాలా। జయజయమందర గిరిధరదేవా జయజయశ్రీగోపాలా ॥౧॥ దానవనాశా దశవిధవేశా దీనజనోద్ధరణా । గానలోలమునిపాలపరాత్పర ఖగకులపతి గమనా ॥జ॥ బృందారకనుత గుమ్మడిదాలా మందిరసర్వేశా । కందిబాల కష్టయ్యనుబ్రోచిన । సుందరయదుభూపా ॥జ॥

వ॥ నారాయణ నారాయణ ఆదుర్మార్గుడగు కంసుడు కృష్ణుని వధించుటకు ఎన్నోపన్నాగములు బన్నుచుండెను గాని విఫలమగుట దెలియకుండెను. నేనిప్పుడేపోయి కృష్ణుడున్నజాడ వానికిందెల్పివచ్చెదను (అని వచ్చుచున్నంతలో)

కంసుని దర్బారు.

కం-వ॥ మంత్రీ నేనంపించిన పూతన శకటాసుర ధేనుకాసుర బకాసుర తృణావర్తులలో నొకరైనను ఇంతవరకు రారైరి కారణమేమో తెలియకుండెను.

మం-వ॥ ప్రభో వారుసామాన్యులుకారు కార్యమును సాధించుకొనియే రాగలరు మీరు నిశ్చింతతోనుండుడు. (ఇంతలో నారదుడు ప్రవేశించినంజూచి)

కం-వ॥ మునివర్యా నమస్కారములు.

నా-వ॥ కంసరాజా క్షేమమేనా.

కం-వ॥ ఎక్కడిక్షేమము. ఆవిష్ణువు నన్నుజంపగోరి ఒక్కడజన్మించి యున్నవాడని విన్నంతమాత్రమున పూతనాది రక్కసులను వానిం జంపరమ్మని బంపియుంటిని కాని వారింతవరకురారైరి వారిసంగతే ఎరుక జేయువారు లేరు.

నా-వ॥ ఆమాట నీకెరుకజేయవలెననే వచ్చియుంటిని వినుము.

వాదము - దరువు.

నా॥ వినుముకంస భూవరయా । విష్ణుమూర్తి నీకొరకును । జనియించియు వ్రేపల్లెలో । మనుచుండెను కృష్ణుడుగను ॥వి॥

వ॥ కంసరాజా ఆవిష్ణుమూర్తి దేవకీవసుదేవుల గర్భమందు జన్మించెను. అట్లు జన్మించినతోడనే వసుదేవుడా బాలునిగొనిపోయి వ్రేపల్లెలో యశోదప్రక్కననిడి ఆమెకుజన్మించిన బాలిక నిందుగొనివచ్చెను. ఇప్పుడా బాలుడు కృష్ణనామంబున వర్ధిల్లుచుండెను వింటివా.

కం॥ ఎంత మోసగించెను న । న్నింతలోనె వసుదేవుడు।పంతముతో యాబాలుని । పట్టిద్రుంతుగదనాడు ॥యెం॥

వ॥ అహో యావసుదేవుడు నన్నెంత మోసగించెనో చూచితివా అట్లుగాకున్న నావైరిని ఆనాడేతుదముట్టింతునుగదా.

నా॥ వనజసంభవుడువ్రాసిన । వ్రాలును దప్పింపగాను । జననాయక యేరితరము । వినుమికనీమనములోను ॥వ॥

వ॥ కంసరాజా బ్రహ్మవ్రాలు దప్పింప నెవ్వరివశముగాదని నీకు దెలియదా.

కం॥ నారదనేబంపు పూత । నాదులెల్ల నింతవరకు । రారైరి యదేమొకాని । వారిజాడ దెల్పునాకు ॥నా॥

వ॥ మునీంద్రా ఆవిష్ణుని తుదముట్టించుటకుగాను నేనుబంపిన

పూతన శకటాసుర తృణావర్తాది వీరలింతవరకు రాలైరి వారిసంగతి నీకేమైన దెలిసిన విన్నవింపుము.

నా॥ వారినెల్ల వధియించెను । వారిజాక్షుడౌకృష్ణుడు । ధారుణి గుమ్మడిదాలా । నారాయణుండతండు ॥వా॥

వ॥ రాజా శ్రీమన్నారాయణాంశ సంభూతుండగు ఆకృష్ణునియె దుట నీవుబంపిన పూతనాదులెంతటివారు వారినందరిని రూపుమాపెను. యికనీవు జాగ్రితగానుండుము. నేను బోయివచ్చెదను. నారాయణ నారాయణ (అని నారదుడు వెడలిపోవుటయు నంత కంసుండు తన మంత్రింజూచి)

కం-వ॥ మంత్రీ నీవిప్పుడేపోయి మన అక్రూరుని నిందుబిలచుకొని రమ్మి పొమ్మి.

అక్రూరుడు ప్రవేశము.

దర్వు॥ నిన్నే నెరనమ్మితిని శ్రీమన్నారాయణా । నన్నుబ్రోవునీదయ శ్రీమన్నారాయణా ॥ని॥ బాలగోపాలశౌరీ నన్ పాలించరా । నీలమేఘ శ్యామల దేహకరుణించరా ॥ని॥ గరుడవాహన సర్వేశకరిరక్షకా । దురిత దానవకులనాశ వరదాయకా ॥ని॥ సుందరంబౌ గుమ్మడిదాల మందిరు డవు । కందిబాలకిష్టయనేలు ఘనుడావీవు ॥ని॥

వ॥ ప్రభో కంసరాజా జోహారులు నన్నుబిలిపించిన కారణమేమో తెల్పుడు.

వాదం - దర్వు.

కం॥ వినుమి యకూ్రిరా । ఒక । పనిగల్గెను నీతోనేడు ॥వి॥ పని గనువేపల్లెకేగి బలరామకృష్ణులాను । మనసును మెప్పించి యిటకుగొని తెనలెగానపొమ్మి ॥వి॥

వ॥ అకూ్రిరా నీవు వేపల్లెకుబోయి బలరామకృష్ణులను నేబిల చితినని చెప్పి యెటులైన యిక్కడికి దోడుకొనిరమ్మి పొమ్మి.

అ॥ ఎందుకొరకునూ । వా । ర్నిందుబిలచుకొనిరావలె ॥నెం॥ సం దేహముదోచెను నాస్వాంతమందు నీమాటలు । డెందమందుదాచక నాకెరుక జేయుకంసరాజ ॥ఎం॥

వ॥ రాజా ఆబలరామకృష్ణుల నిచ్చటిబిలపించుటకు కారణమేమో తెల్పుడు.

కం॥ వినుమి తెలిపెదా । యా । విష్ణుడె శ్రీకృష్ణుండట ॥వి॥ నను జయింపబూని యిట్లు నవతరించినాడటంచు । ఘనులు దల్పవింటిని యిటు గొనివచ్చిన పట్టిదుగ్రింతు ॥వి॥

వ॥ అక్రూరా నాపగవాడగు ఆవిష్ణువే కృష్ణుండై జన్మించెనట కాబట్టి వానిని మాయోపాయంబున నిటుగొనివచ్చిన సునాయాసంగా వధించి కీర్తినొందెదను.

అ॥ ధరణినాయకా । నీ । తరముగాదు వార్ని గెలువ ॥ధ॥ పర మాత్మస్వరూపులు యా । బలరాముడు శ్రీకృష్ణుడు । శరణాగత వత్స లులు । దురితాపహరులువారు ॥ధ॥

వ॥ కంసా నీదురుద్దేశమును మార్చుకొనుము బలరామకృష్ణులను జయించువారు బ్రహ్మాండములో లేరు నీవెంతటివాడవు వారితో మిత్రి త్వము వహించిన జీవింతువు నామాటనమ్ముము.

కం॥ ఎంతటివారూ । ర । వ్వాంతలో వధియింతువార్ని ॥యెం॥ చింతిల్లగనేటికి నేజెప్పినట్లుజేయుము బల । వంతుడనాకేమి యెదురు వా దించక తోడితెమ్ము ॥ఎం॥

వ॥ అక్రూరా నీవేమో వారిని గొప్పజేయుచుంటివి గాని నేనే మాత్రము వారికి భయపడువాడనుగాను. నేను ధనుర్యాగంబు జేయు చున్నాననియు వారిని ప్రేమతో బిలపించుచున్నాననిచెప్పి పిలచుకొని రమ్ము ఇక వాదించకుము.

అ॥ తామసమేలా । నీ। క్షేమమెంగోరి వచించితి ॥తా॥ భూమీ గుమ్మడిదాల । పురవాసుల బ్రోచునట్టి । రామకృష్ణులను యిటకును । కాముకనే దోడితెత్తు ॥తా॥

వ॥ కంసరాజా నీయాజ్ఞానుసారంబుగా నేగి ఆబలరామకృష్ణులను బిలచుకొనివచ్చెదను కానున్నకార్యము కాకపోదుగదా. (అని అక్కడి నుండి వెడలి తనలో) అహా ఈదుర్మార్గునికి అంత్యకాలము సమీపించినది. ఏదియెట్లులైనను నాకాపురాణపురుషుని దర్శనము లభింపనుండెనుగదా (అని వ్రేపల్లెను సమీపించి)

కం॥ ఆకృష్ణుడు బలరాముడు । యీకంసునిమాటవినియు యేవం

దురోకా । నాకేమిదోచకుండెను । యేకరణిని దోడుకొనియు నేగుదు నేనుగ॥ (అని కృష్ణునివద్దకేతెంచి)

వ॥ అహా కృష్ణా నీదరిశనభాగ్యంబున ధన్యుండనైతిని నీకిదేప్రణామంబులు.

కృ-వ॥ అక్రూరా నీకు ప్రతివందనములు జేయువాడను.

కం॥ క్షేమమెమీవారలకు । క్షేమమెమామామ కంసక్షితినాథునకుగ । క్షేమమె మాతలిదండ్రులు । యేమనివచియించిరయ్య యెరిగింపుత్వరగ॥

వ॥ అక్రూరా మీరందరు క్షేమముగా నున్నవారలేకదా.

వాదం - దరువు.

అ॥ క్షేమముగానున్నారము । కృష్ణానీదయతోడను । స్వామీనీ భక్తుడనను । ప్రేమతోరక్షింపుమికను ॥క్షే॥

వ॥ కృష్ణా మేమెల్లరము క్షేమంగానే యున్నవారము కానిమీయీ దాసునియందు అనుగ్రహముంచి రక్షింపుడు.

కృ॥ ననుగన్నా తలిదండ్రులు । నాకొరకై నీతోడను । వినిపించిన సంగతి నాకునుదెల్పుము దయతోడను ॥న॥

వ॥ అక్రూరా నాజననీజనకులగు దేవకీవసుదేవులు నాకొరకై యెంతవిలపించుచుండిరోకదా వారిసంగతివచింపుము.

అ॥ వారలసంగతి నేమని । వచియింతును శ్రీకృష్ణా । ఘోరంబుగ వగతురు నీ। కొరకెంతయు శ్రీకృష్ణా ॥వా॥

వ॥ కృష్ణా ఆపుణ్యాత్ములు నీకొరకై మిక్కిలి దుఃఖించుచుండిరి. నీసంగతి ఆకంసుడువిని వారిని మరల చెరలోబెట్టి పలువిధంబుల బాధించుచుండెను. ఆదుర్మాని నీవెప్పుడు సంహరింతువోకదా.

కృ॥ గట్టిగయాకంసుని తుద । ముట్టించెద నక్రూరా । పుట్టితినందులకే నీ । భువియందున నక్రూరా ॥గ॥

వ॥ అక్రూరా ఆదుర్మార్గుని వధించుటకేగదా నేను జన్మించినది, కాలమురావలెనని చూచుచుంటిని.

అ॥ ధరశ్రీగుమ్మడిదాల । పురినిలయా శ్రీకృష్ణా । పరమాత్మా నినుదెలియా । తరమే యేరికికృష్ణా ॥ధ॥

కం॥ వినుమి తెలిపెదా । యీా । విష్ణుడె శ్రీకృష్ణుండట ॥వి॥ నను జయింపబూని యిట్లు నవతరించినాడటంచు । ఘనులు దల్పవింటిని యిటు గొనివచ్చిన పట్టెదుగ్రింతు ॥వి॥

వ॥ అకూ్రరా నాపగవాడగు ఆవిష్ణువే కృష్ణుండై జన్మించెనట కాబట్టి వానిని మాయోపాయంబున నిటుగొనివచ్చిన సునాయాసంగా వధించి కీర్తినొందెదను.

అ॥ ధరణినాయకా । నీ । తరముగాదు వార్ని గెలువ ॥ధ॥ పర మాత్మస్వరూపులు యీా । బలరాముడు శీకృష్ణుడు । శరణాగత వత్స లులు । దురితాపహరులువారు ॥ధ॥

వ॥ కంసా నీదురుద్దేశమును మార్చుకొనుము బలరామకృష్ణులను జయించువారు బ్రహ్మాండములో లేరు నీవెంతటివాడవు వారితో మిత్రి త్వము వహించిన జీవింతువు నామాటనమ్మును.

కం॥ ఎంతటివారయా । ర । వ్వంతలో వధియింతువార్ని ॥యెం॥ చింతిల్లగనేటికి నేజెప్పినట్లుజేయుము బల । వంతుడనాకేమి యెదురు వా దించక తోడితెమ్ము ॥ఎం॥

వ॥ అకూ్రరా నీవేమో వారిని గొప్పజేయుచుంటివి గాని నేనే మాత్రము వారికి భయపడువాడనుగాను. నేను ధనుర్యాగంబు జేయు చున్నాననియు వారిని ప్రేమతో బిలపించుచున్నానని చెప్పి పిలచుకొని రమ్ము ఇక వాదించకుము.

అ॥ తామసమేలా । నీ। క్షేమమెగోరి వచించితి ॥తా॥ భూమిా గుమ్మడిదాల । పురవాసుల బ్రోచునట్టి । రామకృష్ణులను యిటకును । కాముకనే దోడితెత్తు ॥తా॥

వ॥ కంసరాజా నీయాజ్ఞానుసారంబుగా నేగి ఆబలరామకృష్ణులను బిలచుకొనివచ్చెదను కానున్నకార్యము కాకపోదుగదా. (అని అక్కడి నుండి వెడలి తనలో) అహా ఈదుర్మార్గునికి అంత్యకాలము సమీాపించినది. ఏదియెటులైనను నాకాపురాణపురుషుని దర్శనము లభింపనుండెనుగదా (అని వ్రేపల్లెను సమీాపించి)

కం॥ ఆకృష్ణుడు బలరాముడు । యీాకంసునిమాటవినియు యేమం

దురోకా । నాకేమిఁదోచకుండెను । యేకరణిని దోడుకొనియు నేగుదు నేనుఁ॥ (అని కృష్ణునివద్దకేతెంచి)

వ॥ అహా కృష్ణా నీదరిశనభాగ్యంబున ధన్యుండనైతిని నీకిదే ప్రణామంబులు.

కృ-వ॥ అక్రూరా నీకు ప్రతివందనములు జేయువాడను.

కం॥ క్షేమమె మీవారలకు । క్షేమమె మామామ కంసక్షితినాధునకుఁ । క్షేమమె మాతలిదండ్రులు । యేమనివచియించిరయ్య యెరిగింపుత్వరఁ॥

వ॥ అక్రూరా మీరందరు క్షేమముగా నున్నవారలేకదా.

వాదం - దర్వు.

అ॥ క్షేమముగానున్నారము । కృష్ణానీదయతోడను । స్వామీనీ భక్తుడనను । ప్రేమతొరక్షింపుమికను ॥క్షే॥

వ॥ కృష్ణా మేమెల్లరము క్షేమంగానే యున్నవారము కానిమీయీ దాసునియందు అనుగ్రహముంచి రక్షింపుడు.

కృ॥ ననుగన్నా తలిదండ్రులు । నాకొరకై నీతోడను । వినిపించిన సంగతి నాకునుదెల్పుము దయతోడను ॥న॥

వ॥ అక్రూరా నాజననీజనకులగు దేవకీవసుదేవులు నాకొరకై యెంతపిలపించు చుండిరోకదా వారిసంగతివచింపుము.

అ॥ వారలసంగతి నేమని । వచియింతును శ్రీకృష్ణా । ఘోరంబుగ వగతురు నీ। కొరకెంతయు శ్రీకృష్ణా ॥వా॥

వ॥ కృష్ణా ఆపుణ్యాత్ములు నీకొరకై మిక్కిలి దుఃఖించుచుండిరి. నీసంగతి ఆకంసుడువిని వారిని మరల చెరలోబెట్టి పలువిధంబుల బాధించుచుండెను. ఆదుర్మార్గుని నీవెప్పుడు సంహారింతువోకదా.

కృ॥ గట్టిగయాకంసుని తుద । ముట్టించెద నక్రూరా । పుట్టితినందులకే నీ । భువియందున నక్రూరా ॥గ॥

వ॥ అక్రూరా ఆదుర్మార్గుని వధించుటకేగదా నేను జన్మించినది. కాలమురావలెనని చూచుచుంటిని.

అ॥ ధర శ్రీగుమ్మడిదాల । పురినిలయా శ్రీకృష్ణా । పరమాత్మా నినుదెలియా । తరమే యేరికికృష్ణా ॥ధ॥

వ॥ కృష్ణా ఆదురాత్ముడగు కంసుండు ధనుర్యాగంజేయుదునను నెపంబున నిన్నును మీయన్నయగు బలరాముని బిలచుకొని రమ్మని నన్నంపియుండెను ఇందులకేమందువో తెల్పుము.

కృ-వ॥ సరే అటులేవచ్చెదముకాని ఈసంగతిని మాఅన్నగారి కెరుకజేయవలెను. (అని యిటులనుచున్నంతలో)

బలరాముడు ప్రవేశము.

దర్వు॥ బలరాముడ భుజబలవిక్రముడను । సలలితగాత్రుండను వినరా।హలముసలాయుధముల దైత్యాధములను చెండాడినవాడనురా॥బ॥ ధీవిశాలుడను రోహిణిశ్రీవసుదేవుల కాత్మజుడనువినరా । దేవకినాపిన తల్లియురారా । జీవనయనుకగ్రజుడనురా ॥బ॥ ధరణిలోవెలసిన గుమ్మడి దాల । పురజనులనురక్షింతునురా । కరమొప్పగ నాయనుజునిజూచుట కొరకై నిందేతెంచితిరా ॥బ॥

కృ-వ॥ అన్నయ్యా నమస్కారములు ఆదుర్మార్గుండగు కంసుండు ధనుర్యాగంబు జూచుటకై మనలందోడ్కొని రమ్మని యీయక్రూరుని దోలించియుండెను పోవుదమా.

బ-వ॥ తమ్ముడా అవశ్యముగా బోవుదము సమయముజిక్కినది నాముసలాయుధమునొక్క చిలుమును విడగొట్టెదను.

కృ-వ॥ సరే అక్రూరా బైలుదేరుము మేము నీవెంటనేవచ్చు చుంటిమి రథమాయత్తంబు గావింపుము.

అ-వ॥ ప్రభో రథము సిద్ధముగానే యుండెను రండు. (అనిన కృష్ణబలరాములు రథారూఢులైన నిమిషమాత్రంబున మథురాపురిని సమీపించి) పురాణపురుషులార యిదో మథురాపురమును సమీపించి తిమి నేనుందుగాబోయి మీరువచ్చినటులా కంసునకుదెల్పెదను.

కృ-వ॥ సరే అటులేగావించుము మేము నీవెనుకనే కాలినడకతో ఈమధురాపురి వింతలనుజూచుచు వచ్చుచుండెదము.

రజకుడు ప్రవేశము.

(నందామయాగురుడ నందామయా అనువలె)

దర్వు॥ రాజీతముగ కంసరాజుబట్టలనుదికె రజకుడనూనేను విన రండయా । రజకుండనేగాదు రణరంగమందూన । భుజబలమును జూపె

వాడనయా ॥రా॥ ప్రభువుబట్టలెగాని ప్రజలబట్టలనేను । పాచిముఖముతో నైన జూడానయా। రభసంబునేను రాగానందరుజూచి । రాజసేవకుడంచు మెచ్చేరయా॥నందా॥అర్ధమ్మురాత్రీరినిద్దార మబ్బానఅట్టీబట్టలు మూట గట్టినయా । సద్దియన్నము మెక్కి ప్రొద్దుబొడువకముందె చాకీరేవుకుబోవు వాడనయా ॥నందా॥ ధరణిగుమ్మడిదాల పురమందునెలకొన్న । హరినిస్మరించేటివాడనయా । స్థిరమూతో కంసభూవరిడిచ్చుదానితో । కరమొప్ప కాలంబు గడిపేనయా ॥నందా॥

కృ-వ॥ ఒరే నీవెవండవు.

ర-వ॥ నేను కంసమహారాజుగారి బట్టలుతికే చాకలివాడను.

కృ-వ॥ అటులైన ఆవస్త్రంబుల నిటుదెమ్ము మేము ధరించు కొనెదము.

వాదం - దరువు.

ర॥ ఎవ్వరుమీరెవ్వరు భయమింతయులేకా । యిట్టిభుబట్టలను యడుగుటేల తెలియకా ॥ఎ॥

వ॥ మారాజుగారి వస్త్రంబుల నడుగుటకు మీరెవ్వరు మీకేమైన భయముండెనా లేదా.

కృ॥ కల్లగాదుకంసుని మేనల్లుండ్రముురా । నీ । యుల్లములోపలను భీతినొందకనివరా ॥క॥

వ॥ ఒరే మేము మీకంసుని మేనల్లుండ్రము యీధనుర్యాగంబు జూడవచ్చితిమి మాదుస్తులు బాగలేవు ఆవస్త్రంబులు మాకిచ్చి మీరాజు గారితో జెప్పుము.

ర॥ గొల్లలుమారాజుకు మేనల్లుండ్రటరా । చెల్లునెయీమాట మీకు చేటుమూడెరా ॥గొ॥

వ॥ మీకు గొల్లవాండ్రగుటచే మారాజుకు మేనల్లుండ్రమన నాకు నవ్వువచ్చుచున్నది తొలగిపొండు లేకుండినచో మీభరతంబట్టెదను.

బ॥ ఎంతటివాడౌర నీదు గొంతుబట్టియూ । ఫంతముతోబిసికి నేలపై చెదగనుమూ ॥ఎం॥

వ॥ ఒరేనీచా మమ్ములను గొల్లలనియన్న నీనాలుకను రెండుగా జీల్చిపై చెదను చూడుము.

ర॥ చూడుడి నేభయ మెుందెటివాడనుగానూ । వాడిమిగనుగ్రుద్ది మిమ్ము వసుధగూల్చెదనూ ॥చూ॥

వ॥ ఒరే బాలకులారా మిమ్ముల నిప్పుడేమిజేసెదనో చూడుడు (అని యనుచున్న రజకునిజూచి)

కృ॥ పాతకనారెుక్క ముష్టిప్రహారముచేతా । ఘాతనొంద జేతును నీకంసుడదెంతా ॥పా॥

వ॥ ఒరే నీచా యిదో యీగొల్లపిల్లనిదెబ్బంజూడుము (అని ముష్టి ప్రహారము గావించిన ఆచాకలివాడా బట్టలమూట నక్కడబారవైచి పారిపోవుచు)

ర॥ చాలుర నేచస్తివీడు బాలుడుగాడూ । మేలుగుమ్మడిదాల శౌరి శ్రీలోలుండూ ॥చా॥

సం-వ॥ అని యిటులా రజకుండు పారిపోయిన ఆమూటలోని మంచిమంచి దుస్తులు బలరామకృష్ణులు ధరించుకొని ముందుకు సాగివచ్చుచున్నంతలో

కుబ్జా ప్రవేశము - దరువు.

(చల్లనిరాజా ఓచందమామా - అనువలె)

గోపికలోలా గోపాలకృష్ణా । నాపాలిదైవాము నన్నేలుకృష్ణా । నన్నేలుకృష్ణా ॥గో॥ శ్రీపాతినిన్నెపుడు చింతించెదా । నీపాదములసేవ నేగోరెదా । రావేలనూ । యిందురావేలనూ । ఆపదోద్ధారక నాపాలి కృష్ణా । నన్నేలుకృష్ణా ॥గో॥ నందనందాన యురవిందదళలోచనా । సుందరంబా గుమ్మడిదాల పురపాలనా । బృందారకవందితా । పుణ్యజనసంస్తుతా । మందరోద్ధార మాధవనాపాలికృష్ణా । నన్నేలుకృష్ణా ॥గో॥

వ॥ కృష్ణా నీపాదపద్మంబుల కిదే ప్రణామంబు లాచరించుదానను.

కృ-వ॥ యువతీ నీవెవరు నీనామ మెయ్యది.

కు-వ॥ కృష్ణా నేను కంసునకు చందనాది పరిమళ ద్రవ్యంబుల నర్పించు చుండుదానను. నాపేరు కుబ్జయని యందురు. నేడు నీదరిశన భాగ్యంబున నామనోరథంబు దీరునట్లుగా దలంచెదను.

వాదం - దర్వు.

కు॥ నందనందనా । నే । చందనమును బూసెదగొను ॥నం॥ సుందర వదనారవింద సురవందితమోముకుంద । పొందుగనీపాదములను పూజించెద నన్ను బ్రోవు ॥నం॥

వ॥ కృష్ణా నీకీచందనముబూసి నీపాదపద్మముల పూజించెదను రమ్మా.

కృ॥ మెచ్చితినేనూ । నీ స్వచ్ఛమైన భక్తికెంతో ॥మె॥ సచ్చరిత్రురాలనిదే సరిజేసెదనీదుమేను । హెచ్చుసుందరాంగివిగను । యెసగగలవు పృథివిలోను ॥మె॥

వ॥ కుబ్జా నీభక్తికెంతో నేనుమెచ్చితిని యిటురమ్మా నీవక్రతను బాపెదను. (అని కృష్ణుండు కుబ్జయొక్క మేనును సరిజేసినంజూచి)

కు॥ వనజలోచనా । నా । మనవినువలదనబోకను ॥వ॥ నినుగనుగొన నామదిలో । ఘనమోహం బంకురించె । మనసిజకేళిని దేల్చియు । మదిసంతసమొందజేయు ॥వ॥

వ॥ కృష్ణా నీమోహనాకారంబును జూచినంతలో నామనస్సున మోహంబంకురించెను నాతో రతికేళిందేలి నాకోరిక నెరవేర్చుము.

కృ॥ బోటిరోవినవే । యిది । యేటి మాటవలదువలదు ॥బో॥ హాటకాంగినీతోడను కూటమిజేసినచో నా । సాటివారునవ్వరె నీ । సాటి వాని గూడుపొమ్మా ॥బో॥

వ॥ కుబ్జా యీమాట నాచేగానేరదు ఎవరైనవిన్న నన్నేమందురు. నన్నువిడచి నీసాటివాని నెవనినైనవెదకి కూడుండుము పొమ్మా.

కు॥ కన్యనునేనూ । నేనన్యపురుషులను గోరను ॥క॥ పుణ్యపురుష నన్నుగూడు పుణ్యమగునునీకింకను । ధన్యురాలనేనౌదును । తరుచుమాటలేలస్వామి ॥క॥

వ॥ మదనమోహనా నేను కన్నెరికము చెడనిదాననగుటచే నిన్నే వరించిన నామనస్సును అన్యులకర్పితము జేయను వలదన్నచో ప్రాణంబుల త్యజించెదను.

కృ॥ అన్నులమిన్నా । మా । అన్నయు నాతోడనుండె ॥న॥ క్రన్నన కంసునివధించి । కదలివచ్చినీకోరిక । పన్నుగదీర్చెదనుయిపుడు । బలిమిసేయబోకునన్ను ॥అ॥

వ॥ సుందరీ ముందుగ ఆకంసాధముని వధించి నాజననీజనకుల సంతోషపరచి తిరిగి వెళ్ళునప్పుడు నీగృహంబునకువచ్చి నీకోరిక నెరవేర్చి పోయెదను అంతివరకు ఓపికవహించుము.

కు॥ సంతసమాయే । నా । స్వాంతమందు నీమాటకు ॥సం॥ దంతివరద శ్రీగుమ్మడి । దాల పౌరివాసశౌరి । మంతనమునవస్నిక నీ । మదిలోపల మరువవలదు ॥సం॥

వ॥ ప్రభో అటులేగావించుడు. నిన్నేనమ్మికొని యుండుదానను (అని కుబ్జ శ్రీకృష్ణునకు నమస్కరించి వెడలిపోవుటయునంత)

కృష్ణ బలరామ సంవాదము - దరువు.

కృ॥ పోదాము రారమ్మికా । అన్నయ్య ॥పో॥ వాదించు వైరూల మోదీ ధనుర్యాగ । శూదీమంత్రజ్ఞాల వేధించవలెనుమ్మి ॥పో॥

వ॥ అన్నా బలరామా ఈధనుర్యాగంబును భంగముగావించి మన కెదురైనవారిని వధించెదమురమ్ము.

బ॥ చూడూధనుర్యాగమూ । తమ్మయ్య ॥చూ॥ చూడూమిందున్నట్టి శూరాగ్రగణ్యాల । కూడదుంచీనట్లు గూలంగనేతాము ॥చూ॥

వ॥ అనుజా కృష్ణా అదో అక్కడ ధనువును నిలబెట్టియుంచిరి అది నూడబెరికి అందున్నవారినెల్ల దునుమాడవలయును. (అంత కృష్ణుండు ధనస్సునువిరచి పారవైచి అందున్నవారలను జంపెను)

కృ॥ నీవన్నరీతీగనూ । అన్నయ్య ॥నీ॥ కావారమునసుండు కావాలివారల । బోవనీయకదుంచి । యీవిల్లువిరచీతి ॥నీ॥

వ॥ అన్నా బలభద్రా యిక మనమావలకు సాగిపోవుదమురమ్ము.

బ॥ సరెనిన్ను మెచ్చితినీ । కృష్ణయ్య ॥స॥ ధరణీగుమ్మడిదాల ధామువుండపీవాని । సురమానివరులంత జూచిసంతోషింప ॥స॥

వ॥ కృష్ణా నీపురుషార్థంబునకు నేనెంతయో మెచ్చితిని యిక నాకంసునివధించి లోకమునకు మేలుజేయుదము రమ్ము (అని వచ్చుచున్నంతలో)

చాణూర ముష్టికులు ప్రవేశము.

దరువు॥ జగదేకవీరులాము । చాణూరముష్టికులము । పగవారల బట్టిద్రుంచె । బాహుబలాఢ్యులాము ॥జ॥ రాజీతమూగ కంసరాజునాజ్ఞ

నుండెదాము । భూజనములకెల్ల వేళ । భుగులూబుట్టించెదాము ॥జ॥
కరులనైన గిరులనైన కరములచేజిమ్మెదాము । ధరగుమ్మడిదాలపొరి ।
హరికైనను వెరువబోవు ॥జ॥

సం-వ॥ అని చాణూర ముష్టికులు కృష్ణబలరాములంజూచి యే మనుచున్నారన.

వాదం - దరు్వ.

చా॥ భయములేక మాయాగధనుస్సును । భంగముగావింతికారా।
రయమొనరించెద మిమ్ములనిప్పుడె । రండిగోపబాలకులారా ॥భ॥

వ॥ ఒరే గొల్లకుర్రలారా మీరేమాత్రము భయములేక మా యాగధనస్సును విరచివేసితిరి గావున మిమ్మిప్పుడేమి గావించెదనో చూడుడు.

కృ॥ ఎంతటివాడవురా నీచామ । ముమ్మిట్లుబల్కుచుంటివిక్రూరా।
యింతలోనె నీగొంతుబిసికి యమ । యంతకుపురి కంపింతునురా ॥ఎం॥

వ॥ ఒరేనీచా నీనోటికివచ్చినట్లు ప్రేలితివేని నిన్నిప్పుడే యమ సందనంబున కంపించెదను చూడుము.

ము॥ ముష్టికుండ నాపేరువిన్నచో । ముల్లోకంబులు భయపడురా।
ముషిప్రహారంబులచే మిమ్ముల । నష్టపరచెదను చూడుడిరా ॥ము॥

వ॥ ఒరే కుర్రలారా నాముష్టిప్రహారంబులచే మిమ్ముల రూపు మాపెదను చూడుడు.

బ॥ ఖలుడావిను నీగర్వముసర్వము । గనుగొంటిని నిన్నికవిడరా।
హాలాయుధంబున నిమిషములో నీ । తలకానరికి వేసెదగనరా ॥ఖ॥

వ॥ ఒరే పాపాత్మా యిదో నాహాలాయుధంబున నీమస్తకమును శకలీభూతంబుల గావించితిని చూడుము (అని హాలంబుచేమోదిన ముష్టికుండు నేలంబడి విగతజీవుండగును అదిగని)

చా॥ పోరలార మిమ్మిర్వుర నాదగు । భూరిఖడ్గమున జీరెదరా ।
పారిపోక నిల్వునిల్వుడి యెటుపారియున్న నేవిడువనురా ॥పో॥

వ॥ ఒరే బాలకులారా నాభుజబలంబెరుంగక వాదులాడుచుంటిరి యిదో మిమ్ముల నొక్కపెట్టున జంపివైచెదను చూడుడు (అని తమపైకి లంఘింప జూచుచున్న చాణూరునిజూచి)

కృ॥ దుడుకురక్కసుడ నీయెదపై నాదగు । పిడిగుద్దొక్కటి గుద్దితిరా । వడివడిరక్తము గ్రక్కించితి నీవనగను నెంతటివాడవురా ॥దు॥

సం-వ॥ అని ఒక్క గుద్దుకే చాణూరుని జంపుటయు నదిగని బలరాముండు.

బ॥ తమ్ముడముందుకు సాగిపోవుదము । తడవేలనురారమ్మింకా । యిమ్మహిలోపల గుమ్మడిదాల వు । రమ్మున వెలసినవాడవుగా॥

సం-వ॥ అని యిటులా బలరామకృష్ణులు చాణూరముష్టికుల వధించి వచ్చుచుండుటవిని కంసుండు తనమంత్రులతో నేమనుచున్నాడన.

కం-వ॥ మంత్రులారా మనచాణూర ముష్టికులను వధించి బలరామకృష్ణులు యిచ్చటికి వచ్చుచుండిరట వారినిందు రాకుండ నడ్డగింపుడు (అని యిటులనుచున్నంతలో కృష్ణబలరాము లేతెంచి)

వాదం - దరువు.

కృ॥ ననురాకుండగ జేయం । గను నీకునుసాధ్యమా । దనుజాధమ నీకొర కవ । తారమెత్తుటెరుగవా ॥న॥

వ॥ ఒరే కంసాధమా నన్నురాకుండ జేయుటకు నీతరమా నిన్ను వధించుటకై యవతారమెత్తిన శ్రీమన్నారాయణుండనని యెరుగవా.

కం॥ ఒకచోటనుబుట్టియు వేరొకచోటను బెరగియూ । ముఖ మెత్తుకవస్తివి ఛీ । మూర్ఖుడ పొమ్మింకనూ ॥ఒ॥

వ॥ ఒరే నీవట్టి శూరుడవైయైనచో పుట్టినచోటనేయుండక నాకు వెరచి పారిపోయి వేరొకచోట బెరిగినట్టిచోరుడవు పొమ్ము నీముఖము జూడగూడదు.

కృ॥ చోరుడనేగాదు మహా । శూరుడనే వినుమిరా । ఘోరపాప కారినిన్ను । గూల్చివైతుచూడరా ॥చో॥

వ॥ ఒరే పాపాత్మా నేను చోరుడనుగాను శూరుడనయ్యే వచ్చితినిరమ్ము నీరణకౌశలంబు జూపుము.

కం॥ పోరడవౌనీతో నేను । పోరుసల్పనవ్వరా । పారిపోయిబ్రతుకు నీకు । ప్రాణదానమిస్తిరా ॥పో॥

వ॥ ఒరే ప్రేలెడంతలేవు నీతో నేను బోరినచో యీజనులంత నవ్వరా పారిపోయి బ్రదుకుము. లేదేని నాకరవాలంబున కెరజేతును.

కృ॥ దిట్టతనము జూపకు నీ । జుట్టుబట్టినొంచితీ । గట్టిగనీకుతికె బిసికి । కాలునిపురికంపితీ ॥ది॥

సం–వ॥ అని కృష్ణుండు కరిపై లంఘించు సింహకిశోరమువలె కంసునిపై కురికి వానికిరీటంబునుదన్ని జుట్టునుదొరకించుకొని నేలంబడవైచి ముష్టిప్రహారంబుల నంతమొందించుటయు నదిగని బలరాముండు.

బ॥ జను దెంచినపని దీరెను । జచ్చెను యీకంసుడూ । మనజననీ జనకులకడ । కును నేగెదమిప్పుడూ ॥జ॥

వ॥ కృష్ణా మనమే తెంచిన కార్యము సఫలమయ్యెను యిక మన జననీజనకులకడ కేగి యీవర్తమాన మెరిగించి వారల సంతోషపరచ వలెను రమ్ము.

కృ–వ॥ ఔను పోదముపదుము. (అని దేవకీవసుదేవుల సన్నిధికరుదెంచి) జననీజనకులారా మీకిదే వందనంబాచరించువారము. మమ్ము కరుణించి దీవించుడు.

వాదం – దరువు.

దే॥ రారకుమారా । నను । జేరసుధీరా । రారానినుజూడ కరవు దీరెనుగదరా ॥రా॥

వ॥ కన్నతండ్రి కృష్ణా నిన్నుజూచినంతలో నాకు కన్నులపండు వయ్యెను రమ్ము నాకౌగిమ ద్దియ్యి.

కృ॥ కన్నవారలా । మి । మ్మెన్నగచాలా । మెన్నరాని బాధల నొందించితీనిలా ॥క॥

వ॥ జననీజనకులారా మానిమిత్తమై యాకంసునితో ననేకబాధ లొందితిరి మమ్ముల క్షమింపుడు.

వసు॥ ధాత వ్రాసినా । వ్రాలు । దప్పదెంతైనా । నీతప్పిందేమి గలదు । నిజమిదిసూనా ॥ధా॥

వ॥ కుమారా యిదియంతయు మాపూర్వకర్మఫలమేగాని వేరు గాదు.

బ॥ యీధరందునా । మీకు । బాధలనిడినా । అధముండగు కంసుడు హతమయ్యెనుగానా ॥మీ॥

వ॥ జనకా మిమ్ముల నష్టకష్టంబులం బెట్టిన కంసునివధించితిమి నేటితో మీకష్టంబులు కడతేరెను. రండు ద్వారకకు బోవుదము.

దే॥ యెంతోసుదినముా । నే । డెంతపరువముా । వింతగగుమ్మడి దా లా । వెన్నునికృతముా ॥యెం॥

వ॥ కుమారులారా మీఅమృతోపమానమైన వాక్కులచే నా కెంతో ఆనందమనిపించు చుండెను. తండ్రులారా అటులేపోవుదము పదుడు. (అనిన శ్రీకృష్ణబలరాములు సంతోషస్వాంతులై కంసునితండ్రి యగు ఉగ్రసేనుని బిలిపించి మధురానగరం బాతనికి పట్టాభిషేకం బొన రించి జననీజనకులతోసహా రథారూఢులై ద్వారకానగరంబున కేతెంచి సంతోషంబున నోలలాడుచుండిరంత.

మంగళ హారతి.

శ్రీవసుదేవసుదేవకితనయా । శ్రితజనరక్షక హారతిదో । పావన చరితా భవభయరహితా । గోవిందాజయహారతిదో ॥శ్రీ॥ సరసిజలోచన సన్మునిపాలన । కరివరదాజయహారతిదో । కరుణాకరగిరిధర శ్రీకరయదు । వర వరదాజయహారతిదో ॥శ్రీ॥ నందనందన యరవిందనయనముచు । కుందవరద జయహారతిదో । కందిబాలకిష్టయనేలిన యానందకంద జయ హారతిదో ॥శ్రీ॥

కృష్ణలీలలు సంపూర్ణము.

---

కొండా శంకరయ్యగారి ప్రీమియర్ పవర్ ప్రెస్‌నందు ముద్రింపబడియె, కంజీబజారు, సికింద్రాబాద్.. (ద)